





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# రాజ రాజేశ్వర శతకము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120032887

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

వేములవాడ

# శ్రీ రాజరాజేశ్వర శతకము

రసప్రియ
కేశవాచార్య

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో
ముద్రింపబడినది.



శ్రీ కేశవాచార్య దంపతులు (1972లో)

# అభినందనాశీర్వాదములు.



ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని
ఎం. ఎ., పి. హెచ్. డి.
రిటైర్డు ఆంధ్ర శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వ విద్యాలయం. (ఆం. ప్ర.)

'రసప్రియ' సార్థక బిరుదాంకితులైన శ్రీ కేశవాచార్య కవిగారు రచించిన శ్రీరాజరాజేశ్వర శతకము నందలి పద్యము లందందు చదివి యానందించితిని. ఇందలి ప్రతి పద్యమును శ్రీ కవిగారికి శ్రీరాజరాజేశ్వర దేవునిపైగల యపారములైన భక్తి విశ్వాసములను ప్రకటించుచున్నది. కొన్ని పద్యము లుపమాలంకారములతోఁగూడి సరసములై పూర్వ కవుల శతక పద్యములను దలపించుచున్నవి. అంతమునందలి కొన్ని పద్యములలో శ్రీ కవిగారిప్పటి సంఘమందలి పరిస్థితులను జక్కగా వర్ణించియున్నారు. ఇందలి రచన ధారాళమై లలిత పదప్రయోగ శోభితమై, భక్తినిధానమై, నిర్దుష్టమై చదివినకొలంది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది, రసప్రియు లైన కవిగారు సరసములు, సర్వజనాదర పాత్రములు, భావ గంభీరములునైన రచనలితోధికముగా గావించి యాంధ్ర భాషా యోషకపూర్వాలంకృతులు సంధింతురని యాశించుచున్నాను,

హైదరాబాద్,
ది. 26-1-1970

దివాకర్ల వేంకటావధాని

శ్రీ గడియారం రామకృష్ణశర్మ
కార్యదర్శి : ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాద్.

రసప్రియులు శ్రీ కేశవాచార్య కవిగారు ఆంగ్ల విద్యా పట్టభద్రులు ఆర్థిక గణాంక శాఖలో నుద్యోగులు. అయినను బాల్యమునుండి వీరు ఆంధ్రసాహిత్యాభిరుచిగలవారు. వీరి కవితా లత పూచిన తొలి పూవు కీసర క్షేత్రస్వామి శ్రీ రామలింగేశ్వరునకు సమర్పితమైనది. ద్వితీయ కుసుమము శ్రీ వేములవాడ రాజరాజేశ్వరున కంకితమగు భాగ్యమునకు నోచికొన్నది. వీరికి రచనలలో ముఖ్యముగా భక్తియే ప్రేరకమై నిర్వహించినది. పాఠకులు కవిగారి భక్త్యావేశ భావ వీచికలలో విహరించి రసానుభూతిని పొందగలరనుటలో సందేహములేదు. కొన్ని పద్దెములు ముద్దులు మూటగట్టునట్లున్నవి. సాధారణముగా అన్ని శతకములందు వలెనే ఇందును వివిధ విషయములు స్పృశింపబడి రచయితకు గల లోకజ్ఞానమును వెల్లడించుచున్నవి.

అలతి పదములతో, ఉదాత్త భావములతో నొప్పుచున్న ఈ కృతి క్షేత్రపాలకున కర్పితమై భగవత్ప్రసాద మైనది. శ్రీరాజరాజేశ్వరు ననుగ్రహమున కృతికర్త ఆయురారోగ్య భాగ్యములంది ఆంధ్ర భారతికి ఇతోధిక సేవచేయగలరని ఆశించుచున్నాను.

భాగ్యనగర్,
ది. 23-12-1969

గడియారం రామకృష్ణశర్మ

కళాప్రపూర్ణ
డాక్టర్ దాశరథి, డి.లిట్.
ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి

# గుండె గుడిలో రాజరాజేశ్వరుడు

"రసప్రియ" అనే కలం పేరుతో సుప్రసిద్ధులైన శ్రీ కేశవాచార్యులవారు తమ శ్రీ రాజరాజేశ్వర శతకమును పునర్ముద్రించగలగడం దైవానుగ్రహమే. సందేహంలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు ధన సహాయంచేయుట, శ్రీ రాజరాజేశ్వరస్వామి, కవిగారి స్వప్నంలో సాక్షాత్కరించి ఈ శతకాన్ని పునర్ముద్రణ జరుపమని ఆదేశించుట ఆనందదాయకములైన సంఘటనలు.

"శ్రీమద్వేములవాడ మందిరవరా! శ్రీ రాజరాజేశ్వరా!" వేములవాడ పుణ్యక్షేత్రంలో వేంచేసియున్న స్వామి వారి పై శతకం చెప్పి రసప్రియ గారు కృతార్థులైనారు.

వారి ఇతర గ్రంథాలు చదివియున్నవాణ్ణి గనుక రసప్రియ గారి కవితా మనోహరతను చవిచూచినవాణ్ణి. ఆయనది అపారమైన ధార. భక్తిపారవశ్యంలో, శార్దూలమత్తేభాలు, ఆయనవద్ద పిల్లులవలె మెలగును.

"నీ సంకల్పములేక వెల్వడదుగా నిక్కంబుగా నేదియున్?" అన్నారు కవిగారు ఒకచోట. ఆ సంకల్ప బలంతోనే

'రసప్రియ' కలంనుండి పుంఖాను పుంఖంగా కవితలు వెలువడుతున్నాయి. నాకు నచ్చిన శతకాలలో శ్రీ రాజరాజేశ్వర శతకమొకటి. శతక రచనకు తెలుగు కవులదే అగ్రతాంబూలం. ఈ సంప్రదాయాన్ని రసప్రియగారు నిలబెట్టారు.

ఈ శతకంలో వేములవాడ మహాక్షేత్ర మహాత్మ్యమును గూర్చి వివరంగా వ్రాశారు కవిగారు. సుదూర ప్రాంతాలలోని పాఠకులకు వేములవాడ విశేషం ఈ ఉపోద్ఘాతంవల్ల బాగా అవగతమవుతుంది.

"గుడిలో నుందువా? లేక గుండెగుడిలో
గూర్చుందువో!" అన్నారు కవిగారు.
గుండెగుడియే వాస్తవమైన గుడి.
సర్వలోక నిలయుడు అంతటనున్నాడుకదా!

రసప్రియగారు రసావేశంతో ఈ శతకం రచించారు. కవికి కావలసింది రసావేశమే. అదిలేనినాడు కవిత పేలవం అయిపోతుంది. రసావేశపరులైన 'రసప్రియ' సహజకవి.

ఈ శతకాన్ని పాఠకులు పఠించి ఆనందిస్తారని దృఢంగా విశ్వసిస్తున్నాను.

దుందుభి రథసప్తమి, —దాశరథి
హైదరాబాదు.

త్ర్యర్థి కావ్య నిర్మాత
మహాకవిశేఖర, శతావధాని, కవి సింహ
పోకూరి కాశీపత్యవధానులు
మాజీ గద్వాల రాజాస్థాన కవి
నాగార్జున సాహితీ సమాఖ్యాధ్యక్షుడు.
మాచర్ల.

శ్రీశ్రీ కేశవాచార్య కవి ప్రణీతంబైన శ్రీరాజరాజేశ్వర శతకమును స్థాలీపులాక న్యాయముగా పారజూచితిని. ఇందు భక్తజనాగ్రగణ్యులకును, నైతిక కాంక్షకులకును, సాంఘికా వ్యవస్థాలోకనులకును నత్యంతోపయుక్తములగు పద్యము లెన్నియో కలవు. ఇవి రసప్రయుక్తములుగను, శ్రావ్యములుగను, మృదు మధుర పదభూయిష్టములుగను, భావ బంధురములుగను సలక్షణంబులునై కవితా కౌశలమును ప్రకటించుచు హృదయంగమములై పాఠక లోకమునకు మహదానందము నిచ్చుచున్నవి. శ్రీ కవిగారు అనర్గళ కవితాధార భావపటిమ గలవారు. కావున నిట్టి గ్రంధరాజములను ప్రకటించి సాహిత్యలోకమునకుపకృతి గావించుటకు నీ కవికి నాయురారోగ్యైశ్వర్యము లొసంగి పోషించుగాతమని పరమేశ్వరుని ధ్యానించుచున్నాడను.

మాచర్ల,
ది. 6-11-1970

ఇట్లు.
పోకూరి కాశీపత్యవధానులు

ప్రసన్న భారత వ్యాస
కవిజనారాధ్య, సాహిత్యస్థాపక, కవివీర
వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు, B A.
మాజీ జటప్రోలు రాజాస్థాన కవి
స్నేహలతా కవితా సంఘాధ్యక్షుడు
మహబూబ్‌నగర్,

నా స్నేహలతా కవితాసంఘ సహస్ర సభ్యులలో చి॥ కేశవాచార్యులు, బి. ఏ., ముఖ్యుడు. సాహిత్యలోకమునఁ బేరెన్నిక గన్నవాఁడు. కవితా రసప్రియుండని రసజ్ఞులకుఁ దెల్లమే. లోగడ నేను జటప్రోలు సంస్థాన కవిగా నున్నప్పుడు నావద్ద చదువుకొన్న శిష్యకోటిలో నితఁడు నాకు ప్రియ శిష్యుడు. ఇతడెంత దైవభక్తి కలవాడో అంత కవితాశక్తి కలవాడు. నిరాడంబర జీవి. ఉన్నతాశయములుగల వ్యక్తి. పిన్న వయసునుండియే చక్కని కవిత్వము వ్రాయనేర్చిన 'సహజకవి'.

మాత, మాతృభూమి, మాతృభాష, యీ మూడింటి యందభిమానము మక్కువగాఁగల వాడని యీ కృతి సాక్ష్య మిచ్చుచున్నది.

క్రొత్త పోకడలతో, భావ గాంభీర్యముతో, మృదు మధుర పదజాలముతో హృదయంగమముగ రచింపఁగల నేర్పు కూర్పుఁగాంచిన కవి వీరుఁడితఁడు. 'ప్రౌఢ కవి' బిరుద మునకు తగినవాడు.

ఇట్టి మనోహరములగు కృతులను రచించు శక్తి మా కేశవునకు శ్రీ కేశవుఁడనుగ్రహించుఁగాక ! పట్టభద్రుఁడై, పెద్ద యుద్యోగపదవిలో నున్నను మాతృభాషాసేవను మరవక జేయుచున్న యీ కవి రత్నమునకుఁ జిరాయురారోగ్య భాగ్య శ్రీలు గలుగుఁగాక !

మహబూబ్‌నగర్, | బుధజన విధేయుఁడు
ది. 27-5-1978 | రా. సు. రా ట్కా వి

**Sri K. Vasudeva Rao,** I A.S.,
Ex-Commissioner,
Endowment Department.
Govt. of Andhra Pradesh.

Sri Keshavacharya is a gifted poet and writes generally on the Subject of "Bhakthi" As Collector, Hyderabad I had the occasion to go through his book on "Kesaragiri Sri Ramalingeswara Nakshatramala" It is a popular book relating to Sri Ramalingeswara Swamy of Keesaragutta, in Hyderabad District. He is a dovotee of Sri Raja Rajeswara Swamy. He has now composed "Sri Raja Rajeswara Sathaka" Keeping in view the deity of Sri Raja Rajeswara Swamy at Vemulavada. He has also taken the trouble of giving the preface in Telugu on "Vemulavada Mahakshetram" The preface together with the book will be very useful in the Praise of Sri Raja Rajeswara Swamy.

As he is a Government Employee he is not able to print this by him self. The Devasthanam should undertake such enterprise and encourage such ventures.

Two things are te be done. One is publication of the Book and the Other is adequate remuneration to the poet. The later may be a lumsum amount or any arrangements by which the poet can be suitablly rewarded.

Hyderabad
D. 8-2-1970

**—K. Vasudeva Rao.**

**D. V. Krishna Mnrthy,**
*Amature Litterary Critic,*
HYDERABAD.

I consider it as a matter of proud privilege to pen a few words of introduction on this unique publication devoted entirely to represent the universal aspect of God's innate kindness and love. I have also considered it to be, not a maiden attempt at all, in view of the poet's keenest observation to all the minor details that confront the day to day adversities in this mundane life of ours. I am happy to point out that this presentation gifted away as a choice piece to the feet of Swamy Raja Rajeswara throws in abundance satiriclly all the events that take place amidst us, politically, socially, and economically. To mention a few, the poet lashes out in hysterical terms. of no mean description, the battle of the ballot-box, the enlargement of the gulf of the rich and the poor, and the height of ignorance that prevail inspite of each becoming devotional in his attitudes towards the values of life.

The consensus of the poetical genius of this gifted author suggests only one solution—viz., to devlop and to sustain that development in outlook by each individual in the society and to keep on striving for the establishment of a powerful catholicity of outlook towards oneness of life, the redeemer and the rewarder ultimately being that God only who is described by various appellations in all the religions is, through the centuries, necessarily the working of Universal welfare.

I only wish that the energies expended in this small booklet which is a specimen of brevity should be appropriately received not only by the general reader but by all the devout of all faiths also.

I wish him all prosperity in the name of Sri Raja Rajeswara Swamy and commend this book for the propagation of universality in faith by suggesting the concerned authorities to encourage this text to be kept in all the public institutions.

Hyderabad. —**D. V. Krishna Murthy**
D. 9-2-1972

Thou hast been the fountain perennial
Granting boons of prosperity,
What can I offer Thee, My Grace,
Save my total submission. 1

What imbecility to count the individual drops of rain,
Or the rays of sun or of its counterpart:
How can this mortal brain assess now Thy Glory
And Thy Grace despite his myriad avowed failures? 2

Come out from Thy divine Silence
Come to see the mortal toils
Come again to lift them that keep on to Thy Lotus Feet.
Come, Come on Oh Dear Lord, fast to our vicinity. 3

(From "A Century Praise To The Good Most High"
Free translation of This Satakam by Sri D. V. K. Murty)

కపిలవాయి లింగమూర్తి, M.O.L.
వాణీసదనం.
నాగర్ కర్నూలు, మహబూబ్ నగర్ జిల్లా.

# రసవిపంచిక

ఈ శతకకర్త "రసప్రియ" గా పాఠక లోకానికి చిరపరిచితులు వీరి యింటిపేరు "పోతేదారు" వారు. వీరి పూర్వులు వనపర్తి ప్రభువుల దగ్గర పోతేదారులుగ పనిచేసి కీర్తి ప్రతిష్ఠల నార్జించిరి. హాసదుర్గం కృష్ణమాచార్యుల వారిచే ఉత్తర రంగమని కీర్తించబడిన శ్రీ రంగాపురం కవిగారి జన్మగ్రామము. ప్రస్తుతము వీరు గణాంక శాఖ లోగణనీయ మైన ఉద్యోగిగానున్నారు.

అంకెలు అక్షరాలు అత్తాకోడళ్లు కనుక వానికెప్పుడూ ఎడమొగం పెడమొగాలే, ఒకటి కాలుపెట్టిన మస్తిష్కం కడపలో మరొకటి కాలు పెట్టదు. మా కేశవాచార్యుల విషయంవేరు. వారి వృత్తివేరు, ప్రవృత్తి వేరు. కవితాలక్షణాలు పనిగట్టుకొని చదువకపోయినా పండిత పదవిలో నిలిచిన అస్మదాదులం కవులం కావటంలో వింతలేదు. కాని కేశవా చార్యుల వంటి వారిని జూచినపుడు కవులు తయారుకారు పుడతారు అని ఋజువౌతుంది

ఈ శతకంలో స్తుతి, విన్నపం అను రెండు విషయాలున్నవి. కవిగారి మనోవాక్కులు రెండు వానిలో ప్రసిద్ధ మార్గంలో విహరించి నవి. వీరిలేఖిని ఎడనెడ శబ్దాలంకారాలైన అంత్యప్రాసల విరజిమ్ముతు యతిప్రాసలతో గూడిన వృత్తరచన తనకొక లెక్కగాదన్నంత అవ లీలగా నడిచింది.

44 వ పద్యంలో వీరు శివుని ఏనుగుతోలు కప్పుకొని హిమాల

యాలలో చలికి ఎక్కడుంటావు, నా హృదయంలో వెచ్చగా ఉంటుంది రమ్మంటాడు. 45 వ పద్యంలో ఈనాటి లోకంలో భిక్షమెత్తుకోవటం కష్టం కనుక నీ కోడెకు జతగా నా వ్యామోహమనే కోడెనిస్తాను. బీడువడ్డ నా మానసక్షేత్రంలో వ్యవసాయం చేసుకో. ఉభయులకు లాభం. (నాకు మాన్యంపాలు, నీకు సేద్యంపాలు) అని అంటాడు.

దీనిలో 77 నుండి 88, 92 నుండి 96, 115 నుండి 133 వరకు గల పద్యాలు చదువుతుంటే వీరికి ఈనాటి సమాజంలో జరుగుతున్న అన్యాయాలపట్ల ఎంతతీవ్రమైన ఆవేదనవుందో తెలుస్తుంది దానికితోడు భక్తిభావన, విశ్వైకభావన గూడా నిండుగా ఉన్నవి. 49వ పద్యం, 134వ పద్యం చదవండి. భగవంతునిపట్ల మానవుని ఆత్మనివేదనకు స్వస్వరూప సంధానానికి ఇంతకన్న పరాకాష్ఠ ఇక యుండదు.

రసప్రియ గారు దీనిలో మొత్తం 147 పద్యాలు వ్రాసినారు. (నివేదన, కవిస్తుతి లోని పద్యాలు కలుపుకొని) అష్టోత్తర శత సంప్ర దాయము ననుసరించి 108 పద్యములకే శతకమగును. అందుకే ఇందు 108 వ పద్యం మంగళపద్యము నుంచిరి కవిగారు. తక్కిన పద్యాలు విన్నపాలుగా కనిపిస్తవి.

వీరి పద్యాలు ధూర్జటి శతకంలోని పద్యాలవలె భావపుష్టికలిగి ప్రౌఢంగా సాగినవి. వీరిని "అభినవ ధూర్జటి" యనుట యెంతయు సము చితము "ప్రౌఢకవి" యని రా. సు. రాట్కవిగారు 'రసప్రియ" యని కవిసింహ కాశీపత్యవధానులవారు ఇచ్చిన బిరుదములు వీరి యెడ సార్థక ములైనవి. కనుక వేములవాడ రాజరాజేశ్వరునిపై గంగాప్రవాహ సదృ శమైన పావనశైలిలో ఈశతకాన్ని రచించిన రసప్రియగారు సుకృతులు.

నాగర్ కర్నూలు
ది. 31-12-82

—కపిలవాయి లింగమూర్తి

# కృతజ్ఞతలు

నా యీ శతకమునకు దయతో తమ అమూల్యమైన అభిప్రాయముల రూపమున అభినందనాశీర్వాదముల ననుగ్రహించి నన్నెంతయు ప్రోత్సహించిన పెద్దలు పూజ్యులు పుంభావసరస్వతి శ్రీ ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానులుగారికి, విశ్వవిఖ్యాత విద్వత్కవులు చరిత్రకారులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి, సుప్రసిద్ధ మహాకవులు ప్రజాకవులు ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవివర్యులు శ్రీమాన్ డా॥ దాశరథి గారికి, సహృదయులు సాహిత్యాభిమానులు శ్రీ కొండపల్లి వాసుదేవ రావు, ఐ.ఎ.ఎస్. (మాజీకమీషనర్ దేవదాయ ధర్మాదాయశాఖ) గారికి, విఖ్యాత విద్వత్కవులు చరిత్రపరిశోధకులు శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి, విఖ్యాత విమర్శకాగ్రేసరులు ఆంగ్లకవిశేఖరులు శ్రీ డి. వి. కృష్ణమూర్తిగారికి, నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

ఈ సందర్భమున గురువర్యులు; కీ॥ శే॥ పోకూరి కాశీపత్యవధానులుగారికి, మరియు కీ॥ శే॥ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారికి, నా హృదయపూర్వక భక్త్యంజలులు.

ఈ గ్రంథ ముద్రణార్థము ఆర్థిక సహాయ్యమందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము పాలకవర్గము వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఈ గ్రంథమును శ్రద్ధగా ప్రూపులుదిద్ది, అందముగా అచ్చొత్తియిచ్చిన కవి మిత్రులు కవిభూషణ శ్రీ యర్రం విశ్వనాథంగుప్త, ప్రొప్రైటర్, వై. వి. ప్రెస్, ఖమ్మం గారికి ధన్యవాదములు.

ముఖచిత్రము వేసిన మా చిరంజీవి రాజశేఖరునకు, శుద్ధప్రతులు వ్రాసిపెట్టిన మా అమ్మాయిలు జయశ్రీ విజయశ్రీ లకు అభినందనాశీర్వాదములు.

ఖమ్మం.
ది. 28-1-83

—రసప్రియ

# వేములవాడ మహాక్షేత్రము

యుగాలు గడచినను కాలమెంత మారినను చరిత్ర కందని యే యుగాలనాటి నుండియో మన పుణ్యక్షేత్రములు నేటికిని వెలయుచు అనంత జగత్తునకు ఆస్తికతను ఎలుగెత్తి చాటుచు భాషా ప్రాంతాలకు పరిమితము కాక ధర్మ సంస్థాపకములై సనాతనములై మానవ కల్యాణార్థము వెలసియున్నవి. ఇట్టి ప్రాచీన తరములైన పుణ్యక్షేత్రములలో వేములవాడ మహాక్షేత్రమొకటి, ఇది ప్రధానముగా శైవక్షేత్రమైనను సర్వమత సమాశ్రయ సంధాయిని. ఈ మహాక్షేత్రము ఆంధ్రప్రదేశము న తెలంగాణా ప్రాంతానికి చెందిన కరీంనగరు జిల్లా సిరిసిల్లా తాలూకాలో నున్నది కరీంనగరానికి పశ్చిమాన 20 మైళ్లు, హైద్రాబాదు పట్టణానికి ఉత్తరాన 130 మైళ్ల దూరముండును. జ్యోతిర్లింగముగల కాళేశ్వరము, యోగనరసింహస్వామి వెలసిన ధర్మపురి మహాక్షేత్రములు ఈ జిల్లాలోనేయున్నవి.

మానవోద్ధరణకై వేములవాడలో దయాసింధువును, జగద్రక్షకుడునైన శ్రీ రాజరాజేశ్వరస్వామి జగజ్జనని శ్రీ రాజరాజేశ్వరీ దేవి సమేతముగా వెలసి అసంఖ్యాకమైన భక్తజనుల సేవలనందుకొనుచు వారి మనోభీష్టముల నెరవేర్చుచున్నాడు. శ్రీ స్వామివారి మహిమ అనుభవైక వేద్యమే కాని వర్ణింప నలవికాదు. స్వామిని సందర్శించి వ్యాధి గ్రహాదీతి బాధల నివర్తింప జేసికొన్న భక్తులనేకులు గలరు. ఆస్తికత యడుగంటిన నేటికాలమున కొందరి దృష్టిలో భగవద్భక్తులు వెఱ్ఱివారుగా గన్పించవచ్చును. కాని యెవరి నమ్మకాలు వారివి. నానాటికి ఈ క్షేత్రానికి ధనవ్యయ ప్రయాసలకోర్చి సుదూరమునుండి దిన దిన ప్రవర్ధమానముగా భక్తజనులు తండోపతండమ్ములుగా వచ్చుట నిర్హేతుకము కానేరదు. "నమ్మిచెడువారు నాస్తి యేనాటికైన"

# పూర్వ చరిత్ర

ఈ పుణ్యక్షేత్రమతి ప్రాచీనమైన దనుట కనేక పౌరాణిక చారిత్ర కాధారములు గలవు, త్రేతా యుగమున శ్రీరామచంద్రుడు, ద్వాపరమున పాండవులు ఈ దివ్యక్షేత్రమును సందర్శించి భక్తితత్పరులై స్వామిన ర్చించి తమ మనోభీష్టముల నీడేర్చుకొనిరి. చరిత్ర కందినంత వరకు 'వేములవాడ' చాళుక్యులకు రాజధానిగా నుండెను. "వేములవాడ చాళుక్యులు" అని చరిత్ర ప్రసిద్ధము. ఈ వంశమున పది తరములవారు క్రీ. శ. 750 నుండి 973 వరకు వేములవాడ రాజధానిగా విశాల భూభాగమును పాలించిరి వేములవాడ రాజధానిగా చాళుక్య ప్రభువులు వేంగి దేశమును పాలించిరందురు. వేములవాడ చాళుక్యుల తర్వాత కల్యాణి చాళుక్యుల ఆధిపత్యముండినది. చాళుక్యుల అనంతరము వేములవాడ రాజధానిగా ప్రాముఖ్యతను గోల్పోయెను, తర్వాత యాదవులు, కాకతీయులు ఈ మండలమును 'యలగందల' రాజధానిగా పాలించిరి

వేములవాడ చాళుక్యులు శిల్పకళా పోషకులు సర్వమత సామరస్యము గలవారు. జైన, శైవ, వైష్ణవ శాక్తేయాది మతములును, సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలును రాజ పోషణము నంది సంతరింప బడినవి. క్రీ. శ. 10వ శతాబ్ది యారంభమున ఈ వంశపురాజు అరికేసరి కర్ణాటక భాషా పోషకుడై కన్నడములో ఆదికవి యనబడు 'పంపడు' అను జైన మహాకవికి తన కొలువులో నుద్యోగమిచ్చి అతనిని గ్రంథ రచనకు ప్రోత్సహించెను. కర్ణాటక ఆదికవిని పోషించిన గౌరవము వేములవాడకే దక్కినది. వేములవాడకు దాదాపు నాల్గుమైళ్ల దూరములో నున్న కుడిక్యాల గ్రామములో లభించిన శాసనమువల్ల పంప మహాకవి వేములవాడ నివాసియను విషయమును రుజువు పరుచుచున్నదని పురావస్తు పరిశోధనాశాఖవారు (ఆంధ్రభూమి-7 సెప్టెంబరు 1970) ప్రకటించిరి.

ఈ చాళుక్య ప్రభువులలో నొకరీ దేవాలయ పునరుద్ధరణము గావించి
నట్లు యిక్కడి శిలాశాసనములు పేర్కొనుచున్నవి. శ్రీ రాజరాజేశ్వర
స్వామి చాళుక్యుల ఇలువేలుపు

# రాజేశ్వర ఆలయము

వేములవాడ అనేక దేవాలయములకాలవాలము. శ్రీ రాజరాజేశ్వ
రాలయము ప్రధానాలయము. ఇది తూర్పునకభిముఖమై యున్నది. ఆల
యాంతర్భాగము సువిశాలమైనది ఆలయ ప్రవేశమాత్రాన మనశ్శాంతి
కలిగి అంతఃశుద్ధి యేర్పడుచుండును. స్వామికి ఎదురుగా ముచ్చటగొల్పు
నందులజత, కుడిపైపున రాజరాజేశ్వరీదేవి ఆలయము, ఎడమ భాగమున
శిల్పకలా చాతుర్యమునుచాటు లక్ష్మీగణపతియు గలవు. అమ్మవారి విగ్ర
హము సలక్షణ శిల్పకళా శోభితమై ప్రసన్న వదనారవిందముతో జగ
న్మాతృత్వమును ప్రస్ఫుటింప జేయుచున్నది. శ్రీ రాజరాజేశ్వరలింగము
అతి ప్రాచీనమై, ప్రశాంతమై, దివ్యతేజోవంతమై దర్శన మాత్రాన
" హర హర మహాదేవ శంభో ! " అనుచు సాష్టాంగపడి మ్రొక్కు
లర్పింపవలెనను భక్తిరసావేశము భక్తులకు కలుగుచుండును. ప్రతిదినము
అర్చన సంసేవనాది ఉత్సవాదులతో బహుయాత్రికుల నాకర్షించుచు నీ
క్షేత్రము కలకల లాడుచుండును ఆలయాంతర్భాగ ప్రాంగణమందు
ఒక పురాతన శిలాశాసనము, గండదీప స్థంభము, కల్యాణ మంటపము,
నాగిరెడ్డి మంటపము గలవు. వీటి మాటున అద్భుత మత సాంస్కృతిక
చారిత్రకాంశములు దాగియున్నవి.

# ధర్మకుండము

ఇచటి ధర్మకుండమతి ప్రాచీనమైనది. ఇందలి జలమత్యంత
మహిమాన్వితమైనది. ఈ పవిత్రోదక మహిమను వెల్లడించు గాథలనేక

ములు గలవు. పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని జంపి బ్రహ్మహత్యా పాప పరిహారార్ధము ఈ ధర్మకుండమున స్నానమాచరించి శ్రీ రాజరాజేశ్వరుని పూజించి పవిత్రుడాయెననియు, భాస్కరుడు దక్షయజ్ఞములో హవిస్సు నపహరించుటచే బాహువులు గోల్పోయి ఇందలి జలమున స్నానమాడి స్వామినారాధించి స్వర్ణ బాహువులు పొందెననియు, అంతియేగాక కలియుగమున మాళవదేశపు రాజు రాజ రాజ నరేంద్రు డిందలి జలముద్రావి యిందు స్నానమాడి స్వామిని సేవించి అనివార్య రోగ విముక్తి నొందెననియు నీ కుండమునకు సోపానములతడే కట్టించెననియు మున్నగు విశేషములు ఈ క్షేత్ర చరిత్ర తెలుపుచున్నది. ఈ మాళవప్రభువైన రాజ రాజ నరేంద్రుని కుమారుడే సారంగధరుడని, లోక ప్రసిద్ధమైన సారంగధర చరితము యీ ప్రాంతములో జరిగినదని చెప్పుదురు. వేములవాడ కనతిదూరమున నామ్పల్లి అను గ్రామము ప్రక్కనే ఒక కొండ-ఆ కొండపై శ్రీ నరసింహస్వామి వారి ఆలయము, నపనాధుని గుహ, సారంగధర చరిత్రకు సంబంధించిన చిహ్నములు దర్శనీయములై యున్నవి.

నేటికిని ఈ పవిత్రజల స్నానపానాదులచే వ్యాధిగ్రహాది బాధలు నివర్తిల్లునను భక్తివిశ్వాసములు ప్రబలియున్నవి. భక్తులు ముందుగా నిందు స్నానమాచరించి స్వామిని సందర్శించుట యాచారము.

## ఉత్సవములు

ప్రతి సంవత్సరము మాఘ - ఫాల్గుణ మాసములలో భక్తులు వేలాది సంఖ్యలో దూర దూరములనుండి వచ్చి స్వామిని సందర్శించి సేవించుచుందురు ముఖ్యముగా మహాశివరాత్రి ఉత్సవమత్యంత వైభవోపేతముగా జరుగుచుండును. ఈరోజు యాత్రికులసంఖ్య అసంఖ్యేయమై

పోవును. ఫాల్గుణ పూర్ణిమనాడు స్వామివారి కళ్యాణ మహోత్సవము కన్నుల పండుపుగా జరుగును. ఇచట జరుగు ఉత్సవాదులు మహారాజా స్థాన సంప్రదాయము కలిగి పూర్వవైభవాది ప్రత్యేక విశిష్టతను చాటు చున్నవి. మధుర మంగళ తూర్యాదులు. భేరీ నినాదములు, ధ్వజపతాక తోరణాదులు, వేదమంత్ర ఘోషలు, శాస్త్రి చర్చలు, సంగీత సాహిత్య సభలు, నృత్యకళా విలాసములు, పురాణహరికథా కాలక్షేపములు మొద లగునవి మానసోల్లాసము గూర్చుచు నెంతో వేడుకగా నుండును. ప్రతి దినము ప్రాతఃకాలమున సుప్రభాతాది మంగళ గీతములు మధుర కంఠ ముతో వినిపించుచు ప్రసన్న ప్రశాంత పవిత్ర వాతావరణమును సృష్టిం చుచుండును

## భీమేశ్వరాలయము

ఈ క్షేత్రమున ప్రబలాకర్షణీయమై అత్యంత ప్రాచీనమైనది శ్రీ భీమేశ్వరాలయము. శ్రీ భీమేశ్వరస్వామి అనుగ్రహపాత్రుడై 'భీమకవి' అద్భుత శక్తి సంపన్నుడయ్యెనని అందురు. నన్నయ భట్టారకుడు భార తము వ్రాయుచున్న కాలముననే భీమకవి "రాఘవ పాండవీయము" అను ద్వ్యర్థికావ్యమును 'కవిజనాశ్రయ'మను లక్షణగ్రంథమును వ్రాసె నందురు భీమేశ్వరాలయ నిర్మాణము అత్యద్భుతము. ఇందలి శిల్పకళా నైపుణ్యము వర్ణనాతీతము.

## హరిహరక్షేత్రము

ఈ క్షేత్రమున జ్యోతిర్లింగమని పిలువబడు కాశీవిశ్వేశ్వర లిం గము కలదు అందుచేత నీ క్షేత్రమునకు "దక్షిణకాశి" యని ప్రసిద్ధి కలిగినది. దక్షయజ్ఞగాథ యిచట జరిగెనని అందుచేత నీ క్షేత్రమునకు

"దక్షవాటిక" యను నామాంతరము కలిగెనందురు. ఇచట వీరభద్ర స్వామి విగ్రహమున్నది శైవాలయముతోపాటు వైష్ణవాలయము లుండు టచే నీ క్షేత్రము "హరిహరక్షేత్ర" మనదగియున్నది. ఇచట అనంత పద్మనాభస్వామి ఆలయము, కోదండరామస్వామి ఆలయము అర్జునుడు పూజించెనను బాల రాజేశ్వరాలయము. కేదారేశ్వరాలయము. బలిపీఠము కలిగి శాక్తేయమతమును స్మృతికిదెచ్చు బద్ది పోచమ్మ ఆలయము, నగ రేశ్వరాలయము, 'విశ్వకర్మ' గా గుర్తింపబడిన పంచముఖ బ్రహ్మాల యము మొదలగునెన్నో దేవాలయములు గలవు. ప్రతి దేవాలయమున కొక మహాత్మ్యము, విశిష్టత కలదు ఇచటి 'వల్లిబండ' బహుభక్త జనాకర్ణణీయమైనది.

## సర్వమత సామరస్యము

ప్రధానముగా శైవక్షేత్రమైనను ఇచట శైవమూర్తులేకాక వైష్ణవ జైన బౌద్ధ నాగ శాక్తేయాది విగ్రహములుకూడ పూజల నందుకొనుట, ప్రధానాలయ ప్రాంగణముననే మహ్మదీయ దర్గా వెలసి హిందూభక్తుల సయితము నాకర్షించుచు నివేదనల నందుకొనుట ఒక అపూర్వ సంప్ర దాయము. వివిధ మతములందు సమైక్యభావమునెరపి 'వసుధైక కుటుం బము'ను దివ్యభావము స్ఫురింపజేయుచు సర్వమత సామరస్యమును నెల కొల్పుచు అఖండ మహిమాన్వితమైన ఈ మహాక్షేత్రము మానవ కళ్యా ణార్థము వెలసియున్నది.

కుబేరు డీశ్వరు నారాధించి ఈశ్వరానుగ్రహమున మహాసంపన్ను డాయెను కుబేరునకు రాజరాజు అనుపేరు కలదు. కుబేరుడారాధించుటచే రాజరాజేశ్వరుడను పేరువచ్చెనేమో! ఈశ్వరారాధనము ఐశ్వర్య సాధ నము. 'భూతిమిచ్ఛేత్మహేశ్వరాత్' కావున అష్టైశ్వర్య ప్రదాతయగు శ్రీ రాజరాజేశ్వరు నారాధించి ఇహ పర సౌఖ్యములబడసి మానవాళి తరించుగాక!

# నివేదన

ఇరువది మూడేండ్ల క్రిందటి మాట. 1959 సెప్టెంబరు నెలలో మొదటిసారిగా నాకీ పుణ్యక్షేత్రమును సందర్శించు భాగ్యము కలిగినది. నే నప్పుడు మాతృశోకముతో పరితపించుచు "మాతృశ్రీ" వ్రాయుచుంటిని. బహుకాలము వరకు నా కప్పుడు మనశ్శాంతిలేదు. ఉద్యోగరీత్యా నేనప్పుడు కరీంనగరులో నుంటిని. అప్పుడప్పుడు వేములవాడ రాజరాజేశ్వరస్వామిని సందర్శించుచు కొన్నిపద్యములు "శ్రీరాజరాజేశ్వరా" అను మకుటముతో మా మాతృశ్రీ ఆత్మశాంతికై ఆవేదనలో రచించితిని. మాతృశ్రీకాత్మశాంతి ప్రాప్తించిన సంగతి నెఱుంగను కాని శ్రీ స్వామి సందర్శన భాగ్యముచే పరితపించు నా యాత్మకూఱట కలిగెను. సందర్శించి నప్పుడెల్ల స్వామి సాన్నిధ్యములో నొకటి రెండు పద్యములు వ్రాసితిని అట్టి పద్యములీ శతకమందలి ఈ సంఖ్యలు గలవిగా గుర్తించనగును. (7, 10, 33, 34, 35, 48, 59, 63, 110, 111, 112)

1962 జూలైలో తిరిగి నా బదిలీ హైదరాబాద్ నగరమున కయినది. వాతావరణము మారినను నా హృదయ మందిరములో శ్రీ రాజరాజేశ్వరస్వామి మధుర మంగళ నామ మకుటము మారుమ్రోగు చుండెడిది. ఈ త్రిగజన్మోహన మకుటములో నేమహత్తుగలదో కాని నాకవితాకుమారి మకుటస్మరణ మాత్రాన మాటి మాటికి మత్తేభ శార్దూలములపై నెక్కి విజయ విహార మొనరించ నుత్సహించినది. శ్రీ స్వామి భవ్య కృపా సహాయ్య మండగాగైకొని నా నేర్పుకొలది భక్తిరస ప్రధానముగ ఈ శతకమును పూరించితిని. శ్రీ స్వామి దివ్యనామ మకుటస్మరణయే నా యీశతక రచనకు ప్రేరణ.

ఈ శతకమును పూరించుచున్న కాలముననే కేసరస్వామిని 1966 శివరాత్రికి సందర్శించుకొన్న సందర్భమున కేసరాద్రినిలయా "శ్రీరామ

లింగేశ్వరా" అను మకుటముతో నక్షత్రమాలను వ్రాసి శివరాత్రికి 1968లో ప్రకటించితిని. ఇది నాతొలి ముద్రిత గ్రంథము, దీనికి పూజ్యశ్రీ దివాకర్ల వేంకటావధానులవారనుగ్రహించిన అభినందనాశీర్వాదము నన్నెంతో ప్రోత్సహించి, నాకలమునకు ఎంతో బలము నిచ్చినది భక్తి ప్రధానములును నాకు ప్రీతిపాత్రములునైన ఈ శతకమందలి కొన్ని పద్యములను నక్షత్రమాలలో చేర్చితిని.

నేనీ శతకము వ్రాయుచున్నప్పుడు పూజ్యులు కీ॥ శే॥ శ్రీ మహాకవిశేఖర పోకూరి కాశీపత్యవధానులుగారు, శతావధాని శ్రీ దోకూరికోట్ల బాలబ్రహ్మాచార్యులుగారు నా పద్యములువిని ఆనందించి నా వెన్నుతట్టి వాత్సల్యముతో నన్నెంతో ప్రోత్సహించి దీవించిరి.

ఇది ద్వితీయ ముద్రణ. మొదటి ముద్రణ మహాశివరాత్రి 1972 లో జరిగినది అప్పుడు శ్రీ వేములవాడ దేవస్థానమువారు రు. 216/- పారితోషికముగా నాకు బహూకరించిరి పదేండ్లయినది. వెయ్యిప్రతులు ఎప్పుడో అయిపోయినవి మళ్ళీఇప్పుడు శ్రీ టి, టి, డి, వారి ఆర్థికసహాయ్యముతో ఈ ముద్రణ భాగ్యము కలిగినది. ఇది నాకు నేనై ప్రయత్నించినదికాదు నాకొకనాటి రాత్రి సిద్దార్థి ఆశ్వీయుజ అమావాస్యరాత్రి తెల్లవారితే సోమవారము (చిత్రనక్షత్రం తెల్లవారుజామున) స్వప్నములో శ్రీ వేములవాడ రాజరాజేశ్వర స్వామి దివ్యలింగ సందర్శన భాగ్యము కలిగి ఆ దివ్యలింగములో లీలగా శ్రీ స్వామి దివ్యతేజో విలాస భాసుర వదనారవిందము అత్యంత సుందరములైన పెదవుల కదలికతో "రాజరాజేశ్వరశతకం మళ్ళీముద్రించుమని ఆనతిచ్చినట్లు చిరునవ్వు చిందిస్తూ ధరతక్కువ పెట్టుమన్నట్లు స్వప్నమయ్యేను. తెల్లవారలేచి కలలు భ్రమలనుకొనే నేను ఇంత సుస్పష్టమైన దివ్య స్వప్నమును తేలికగా త్రోసి పుచ్చుటకు మనస్కరించక కొంత తడవాలోచించి ఇది స్వామివారి ఆదే

శముగా తలదాల్చి ఈ శతక పునర్ముద్రణకై ప్రయత్నించ నిశ్చయించు కొంటిని. ఆ రోజునుండే శతకమును తిరిగి వ్రాయ నారంభించితిని. మొదట వ్రాసి అచ్చులో చేర్చక వదలిన అధిక పద్యములనుకూడ చేర్చి శతకమంతయు ఎత్తి వ్రాసితిని. మా అమ్మాయిలు రెండు శుద్ధప్రతులు వ్రాసిపెట్టిరి. టి.టి డి. వారి అడ్వర్ టైజుమెంటు ధార్మిక సంబంధమైన గ్రంథముద్రణ సహాయ్యముగురించి వార్తాపత్రికలో వచ్చినసంగతి దృష్టి కిరాగా ఒకప్రతి శ్రీ టి.టి.డి. వారికి పంపుతూ ముద్రణకై ఆర్థిక సహా య్యమర్థించితిని. వారిసహాయ్య సంపత్తితో ఈ ముద్రణ కార్యక్రమము నెరవేరబడి నేను కృతార్థుడనైనట్లు భావిస్తున్నాను. ఈ స్వప్నము రాకుం డినచో నేనీ ముద్రణకు ప్రయత్నించి యుండువాడనుకాను. టి.టి.డి. వారికి ముద్రాణార్థము నా మరొక గ్రంథము అచ్చుకాని వాటిలోనుండి "శ్రీరంగ శతకము" కాని "భద్రగిరి శతకము" కాని "శ్రీ వెంకటేశ్వర స్తుతిమాల" కాని పంపియుండువాడను. ఈ శతకము పంపకుందును. అంతయు నీశ్వర సంకల్పముకదా! ఆ సందర్భమును పురస్కరించు కొని వ్రాసిన పద్యమిది.

అది స్వప్నస్థితి లింగమందు దరహాసాస్యంబుతో నాకు నిం
పొదవన్ దర్శనమిచ్చి నాదు శతకంబున్ మళ్లిముద్రించి దా
ని దరన్ దక్కువ బెట్టుమంటి వదియున్ టీ.టీ.డి. నీయాన దీ
ర్చె దయన్ నన్ను గృతార్థుఁజేయఁగఁ ప్రభూ! శ్రీ రాజరాజేశ్వరా!

మరొక విషయము విన్నవింతును నేను చిత్తూరులో పనిచేయు చున్నప్పుడు 1972లో ఒకనాడు శ్రీ జగద్గురు కంచికామకోటి పీఠాధిప తులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వాములవారిని సందర్శించి శ్రీ స్వామివారికి అప్పుడే అచ్చుఅయిన ఈ శతకమును సమ ర్పించుకొంటిని. శ్రీవారు అమితానందభరితులై నా గ్రంథమును స్పృశించి

చిరునవ్వులతో నన్నాశీర్వదించిరి. అదేరోజు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వాములవారినిగూడ సందర్శించి వారికిని ఒక ప్రతి సమర్పించి నమస్కరించితిని. శ్రీ వారు మిక్కిలి సంతసించి నన్ను కూర్చుండబెట్టుకొని కొన్ని పద్యములు నాచే చదివించుకొని విని ఆనందించి నన్నాశీర్వదించిరి. నాకింతకన్న ఏమికావలె. శ్రీ జగద్గురు స్వాములవారల మహదాశీర్వాదములు ఈ దివ్య స్వప్న వృత్తాంతము నన్నెంతో ప్రోత్సహించి ధన్యుని జేసినవి.

శతకమంతయు భక్తిరస ప్రధానముగా రచించుటే నాధ్యేయము. కాని భక్తిగురించి నా కేమియు తెలియదు దానిగురించి చెప్పలేను, అదొక అనిర్వచనీయమైన రసానుభూతిగా నా కనిపించును. భక్తియున్న పరమార్థము సిద్ధించునని భక్తిలో రక్తి రసానుభూతి కలదని నమ్మెదును. కష్టనివృత్తి సుఖప్రాప్తి ఈరెండే ప్రతిప్రాణి కోరునది. ఈరెండునూ భక్తితో భగవంతుని ఆరాధించుటలో సాధ్యమగునని నా నమ్మకము.

ప్రవాహముతో కొట్టుకొని పోవువాడు ఏదోయూతకై ప్రాకులాడు నట్లు కష్టాబ్ధిలో ప్రాణికోటి నిస్సహాయ స్థితిలో ఏదో మానవాతీతమైన దైవశక్తి నాశ్రయించక తప్పదు.

పసిబిడ్డ చనుబాలకై తహతహ పడునప్పుడు అంతకు వెయ్యింతల తహతహతో కడలెత్తి పొంగు తల్లిప్రేమవంటిది. దైవానుకంపనము.

అట్లని పురుషకారమును విస్మరించువాడనుకాను. పురుష ప్రయత్నమునకు దైవానుగ్రహములేకున్న నిరర్థకమని దైవముపై భారముపైచి పురుషకారము సాగించవలెనని నా భావము. శ్రమైకజీవనములో విశ్వాస మున్నవాడను. శ్రమైకజీవన సౌభాగ్యమునకై ఈశ్వరుని ప్రార్థించుచు వ్రాసిన పద్యములురెండు పొరపాటున శతకమందుచేర్చబడనివి ఈ క్రింద విన్నవింతును.

అవనివ్ కార్మిక కర్షకాది జనులంద్రశ్రాంతమున్ రేగుచు
న్నవి కష్టాగ్ని కణాలు వాటిని శమించన్ శ్రామిక స్వేద బిం
దువు లొక్కొక్కటి జేరి సంద్రమగుచున్ దుర్భిక్షమున్నార్పు న
చ్చివ మార్గంబును జూపవే! హరహరా! శ్రీ రాజరాజేశ్వరా!

గుడిలోనుందువా! లేక గుండెగుడిలో గూర్చుందువో! రోజు బిం
దెడు స్వేదమ్ము స్రవించు శ్రామికుల యందీవుండవా? చెప్పు మె
క్కడ నీవుండవు? సర్వలోక విలయా! కై మోడ్చి నీసేవ చే
సెడి భాగ్యంబిడి ప్రోవవే! హరహరా! శ్రీ రాజరాజేశ్వరా!

శతక మందలి పద్యములన్నియు భక్తిరసాస్పదములైనను శతక సంప్రదాయము ననుసరించి సాంఘికావస్థలు దెలుపు కొన్నిపద్యములిందు చివరన చేర్చితిని. రెండు దశాబ్దముల క్రింద వ్రాసినవైనను నేటికిని అవి సామాజిక దర్పణములుగా నున్నవి. చెడును నిరసించుట, మంచిని ప్రేమించుట, సామాజిక ప్రయోజనము కొరకై ఈర్ష్యా ప్రలోభాది అవగుణములను గర్హించుట కవుల ధర్మము కదా! దుర్భర సాంఘిక జీవనమునకు స్పందించని వాడెవడు? దురాచార దురాగతాది అకృత్యములు సంఘాభ్యుదయ నిరోధక చర్యలు ఏ రచయితను కలచక మానును? నైతిక విలువలు పెరగవలె! అశుభము తొలగవలె! శుభము చేకూరవలె! దానవత దెగడబడవలె! మానవత నెగడవలె! మనుగడ సాగవలె! విశ్వశ్రేయము వర్ధిల్లవలె! ఇందుకు విశ్వకుటుంబియైన విశ్వేశ్వరుని కరుణావిలాసము చిందవలె! అందుకు పరమేశ్వరుని ప్రార్థించవలె అని నా భావన.

'ఇదియే నా కవితా ధ్యేయమ్!?
ఇదె కాదా విశ్వశ్రేయమ్!?

ఇంచుమించు అన్ని పద్యములందును కామ్యమును పొందుపరచితిని. చతుర్విధ పురుషార్థములందు కామము, మోక్షముకన్న ముందు చెప్పబడినది కదా! ఎన్నో పద్యములు ఉత్తమ పురుషములో అనగా "నన్నేలుకో—నా వెచ్చని గుండెలో నన్ను కృతార్థు జేయగదవే!" మొదలగు వాటిలో వ్రాయబడుటచే స్వీయత గోచరించినను, పఠితలు తమకుగా ననువర్తింప జేసుకొని నా అనుభూతిని వారి వారికి నచ్చినంత వరకు పంచుకొన వచ్చునని తలంతును. "విశ్వశ్రేయఃకావ్యమ్" అను సూక్తి ననుసరించి లోకైక క్షేమ మీ కృతియందలి కామ్యముగా పొందుపరచితిని. లోకము నుండి వేరుకాని నాకును మీకును సర్వజనులకును జగజ్జనకుడైన శ్రీ రాజరాజేశ్వరస్వామి క్షేమము చేకూర్చు గాక! అని ప్రార్థించుచు శ్రీస్వామి దివ్యచరణారవిందముల కీ శతకమును సమర్పించుకొనుచున్నాను. ఈకృతి సహృదయుల నలరించినచో కృతార్థుడనైనట్లు భావింతును.

"సర్వేజనా స్సుఖినో భవంతు!"



స్వామీ! నీవెటు మంచుకొండపయి వాసంబుంటివో! యెంతగా
నీ మేనెట్లు చలిన్ భరించెనోకదా! నీ కోసమై వెచ్చగా
ధామంబేర్పడనిత్తు నా యెదదలో తండ్రీ! వసింపంగదే!
శ్రీ మద్వేములవాడ మందిరవరా! శ్రీ రాజరాజేశ్వరా!

# స్మృత్యంజలి

జనని! నీ స్మృతి కొరకు నీశ్వరునకంకి
తముగ నిడినట్టి ఈ శతకమును వెలువ
రించినాడను గాని మాతౄణమింత
దీరునే జన్మలెన్ని యెత్తినను గాని?

జననీ! కృపా తరంగిణి!
నినుదలచినయంత కనుల నిండుచు నుప్పొం
గిన జలమున నభిషేకం
బొనరింతు భవత్పదాబ్జ యుగళికి భక్తిన్!

భారమునెంచకుండ నను బంగరు గర్భమునందుమోసి, ఈ
ధారుణిజూపి, నీ అమృతధారలతో ననుబెంచి నా పయిన్
బేరిమి కూర్మియెప్డు కురిపించిన తల్లివినీవు జన్మలో
నీ ఋణమెట్లుదీరు జననీ! పరిపూర్ణ కృపా తరంగిణీ!

కంటికిరెప్పవోలె ననుగన్న దినంబున నుండి యెప్పుడే
కంటకమంటకుండ కడగంటను గాచుచు నా కొకింత కీ
డంటిన రాత్రియున్ బవలు నారటమొందుచు నా సుఖమ్ముకై
కంటికొకింత కున్కయిన గానవుగా జననీ కృపాధునీ!

ఇంటికి పెద్దదిక్కవగుటేవెటు మమ్మెడబాయలేక నీ
వొంటరివై మరెక్కడ అయోమయమై పడికొట్టుకొంటివో!
కంటికి కానరావు మముగన్న దయామయి మాకు నీ పదా
లంటెడు భాగ్యమింక కరువయ్యెగదా! జననీ! కృపాధునీ!

నీదు సహనము భూమిని నీదు నీవి
జలదమును నీశుచిత్వము జాతవేది
నీ దయాపూర్ణత సుధాంబు నిధినిమించ
మాతృదేవతా నిన్నెట్లు మరువగలము!

జన్మజన్మల మరువక జనని ఋణము
వ్రాసికొందును హృదయ పత్రమ్ముమీద
మాతృమూర్తిని నిరతము మరువకుండ
హృదయ ఫలకము మీద చిత్రించుకొందు!

పరమసాధ్వివి సౌభాగ్యవతి వటంచు
వెదకి పేరంటమునకు నిన్ వేల్పుసతులు
పెద్ద ముత్తైదువ వటంచు బిలచిరొక్కొ!
కానిచో దివికిపుడె యేగంగనేల?

పుత్రులందు నీకు పుట్టెడు బేరిమి
కూతు మీద నీకు కూర్మిమెండు
భర్తమీద నీకు భక్తి నిండగు గాన
దివికి నెట్టులేగితివొ గదమ్మ!

అది "మాతృశ్రీ" దానిని
చదువుచునున్నపుడు కనుల జలమూరుట నే
నది ప్రకటించక నీ స్మృతి
కిది శివకృతి నిలుచునంచు నెంచితి తల్లీ!




F RajaShekhar
నీవే విశ్వము విశ్వమంతయును నీవేకానిఈదివ్యతే
జీవంతంబగు శిల్పికల్పితకళాసూక్ష్మంబులో లీనమై
నీవిశ్వాకృతి నిండియుండదెటు? నిన్నేనమ్మికైమోడ్చుచున్
సేవింతున్భవదీయమూర్తినిహా శ్రీరాజరాజేశ్వరా

# కవిస్తుతి

తొలుతన్ వేములవాడ భీమకవి నెం
తున్, పోతనామాత్యునిన్
దలతున్, భక్తి కవిత్రయంబును మదిన్
ధ్యానింతు, శ్రీనాథునిన్
గొలతున్, సోము నుతించెదన్, పొగడెదన్
గోపన్న వేమన్నలన్,
చెలువారన్ ప్రణుతింతు పూర్వకవులన్
శ్రీ రాజరాజేశ్వరా!

వినుతిన్‌జేయుదు రాట్కవిన్, గొలిచెదన్
వేదాంత విద్వత్కవిన్
గణుతిన్‌జేయుదు విశ్వనాథుని, దివా
కర్లన్ స్తుతింతున్, మనం
బున డోకూరి కవీశ్వరున్ దలచెదన్
పోకూరి కాశీపతిన్
నెనరున్‌బూని స్మరింతునెప్పుడు మదిన్
శ్రీ రాజరాజేశ్వరా!



శ్రీ ర స్తు

శ్రీ రాజరాజేశ్వరాయనమః

# శ్రీ రాజరాజేశ్వర శతకము.

శ్రీ మాని స్తుత యుష్మదంఘ్రి యుగళిన్
సేవింతు లోకైక సం
క్షేమార్థంబు జగత్కుటుంబి వగుటన్
జేకూర్చు మశ్రాంత ము
ద్దామశ్రేయము సర్వ మానవులకున్
దాక్షిణ్యమేపారగన్
శ్రీమద్వేములవాడ దివ్యసదనా!
శ్రీ రాజరాజేశ్వరా! 1

జయ గౌరీప్రియ! భక్తహృన్నిలయ!

విశ్వశ్రేయ భవ్యాశయా!

జయకారుణ్య రసప్రపూర్ణ హృదయా!

సద్ధర్మ రక్షాక్రియా!

జయగోరాజహయా! సుధీచయ! జగత్

సామ్రాజ్య భాగ్యోదయా!

ప్రియమొప్పన్ పిరులిచ్చి ప్రోవు సదయా!

శ్రీ రాజరాజేశ్వరా! 2

శ్రీ గౌరీరమణీవరా! త్రిభువన

శ్రీరాజ్య లక్ష్మీధరా!

యోగిస్వాంత సరోరుహాంతర చరా,

ప్రోద్యద్దయా సాగరా!

జై గైర్వాణ సముద్ధురా! శుభకరా!

జై దోష నాశంకరా

శ్రీ గంగాధర! కావవే! హరహరా,

శ్రీ రాజరాజేశ్వరా! 3

ఓ గంగాధర! ఓ సుధాకరధరా!
ఓ సర్వలోకేశ్వరా!
ఓ గౌరీవర! ఓ రమాధవశరా!
ఓ భక్తహృన్మందిరా!
ఓ గంభీర దయాకరా! శుభకరా!
ఓ దోష నాశంకరా!
శ్రీగూర్పంగదె నీకు మ్రొక్కెద హరా!
శ్రీ రాజరాజేశ్వరా! 4

నిను వర్ణింపగ వెయ్యినోళ్ల ఫణికే
విక్కాంబుగా చేతగా
దణుమాత్రంబిక నొక్కనోరుగల
నాకౌనెట్లు నిన్గూర్చి వ
ర్ణనసేయన్ ద్రిగజత్ప్రభూ! కరుణతో
నాస్తోత్రమాలించి కూ
ర్మివి నన్నేలు కొనంగదయ్య వరదా!
శ్రీ రాజరాజేశ్వరా! 5

గంగా నిర్ఝరిణీధరా ! శుభకరా !
కారుణ్య రత్నాకరా !
శృంగారేందుధరా ! జగత్ప్రభువరా !
చిత్రాంబరా ! నీకు సా
ష్టాంగంబొప్ప నమస్కరించి మది
విన్నాణ్రాంతమున్ గొల్తు న
ర్థింగాపాటుము భక్తపాలనధురా !
శ్రీ రాజరాజేశ్వరా ! 6

పదముల్ సాలవు నీ పదాబ్జ్గాలవ
భావంబింతకున్ జాలదిం
పొదవన్నీ మహిమోన్నతుల్వొగడ
శంభూ ! యెట్లువర్ణింతు నిన్
జదువుల్ నేర్వగలేదు నీ పదసరో
జశ్రీలపై వ్రాలి చే
పెద నీసంస్తుతి దివ్యగాన మశనై
శ్రీ రాజరాజేశ్వరా ! 7

రవి భాస్వత్కిరణంబులున్ విమల
తారాపుంజముల్ వర్ష బిం
దువులున్ లెక్కిడ ఏలుకావి గతి
నిర్దోషాంచితంబైన పం
స్తవనీయంబగు నీ గుణంబులును
సాధ్యంబౌనె లెక్కింపగన్
శివః గౌరీధవః కేశవార్చిత పదాః
శ్రీ రాజరాజేశ్వరా 8

రాజుల్ రాజ్య విహీనులైరి కవులన్
రంజింప పోషింప నా
రోజుల్ బోయెనటంచు చింతిలను
ముల్లోకాలకీవే మహా
రాజగ్రామణివైన విన్నపమున్
ప్రార్థించెదన్ నాకు సు
శ్రీ జెన్నొంద నొసంగి ప్రోవగదవే
శ్రీ రాజరాజేశ్వరా ! 9

రాజుల్ భోజులు బూజు పట్టుదురు
సామ్రాజ్యాధి కారంబులే
రోజున్ శాశ్వత మొందజాలక
వినిర్మూలించు నౌరా! భవ
త్పూజనోద్భవమై తవర్చు జగతీ
సామ్రాజ్యమో శాశ్వత
శ్రీజానొందుచు నుండుగా హరహరా!
శ్రీ రాజరాజేశ్వరా! 10

నీ సంకల్పము లేక వెల్వడదుగా
నిక్కంబుగా నేదియున్
నీ సంకల్పమె కారణంబగుటచే
నే వ్రాయు పొత్తంబునన్
దోసంబుండిన నా పయిన్ గరుణ
నిర్దోషంబు గావించి తం
డ్రీ! సౌరొందగ జేయుమీకృతి నిలన్
శ్రీ రాజరాజేశ్వరా! 11

చక్షుః శ్రోత్ర మనంబు లుల్లసిల
విశ్వశ్రీ ప్రదీపంబులై
నీక్షేత్రంబు పతాక తోరణ సుమా
నీకాది దృశ్యాలతో
సుక్షేమంకర వేద ఘోషములతో
శోభిల్లు వాద్యాలతో
నిక్షేపంబుగఁ గ్రాలుచుంటి వెపుడున్
శ్రీ రాజరాజేశ్వరా! 12

అదె గంగావది ధర్మకుండమయి
దోషౌఘాల క్షాళించు చు
న్నది యిచ్చోట నటించు నార్యులవ
విన్నాడన్ యదార్థంబు గా
దది నీదివ్య కృపాతరంగిణియె
ఇట్లాకుండమై వర్ధితెన్
పృథివిన్ భక్తుల పాప పంకముడుపన్
శ్రీ రాజరాజేశ్వరా! 13

రోగుల్ మూగలు గ్రుడ్డివారలు
భయార్తుల్ నీదుసాన్నిధ్యమం
దో గంగాధర! కావవే! శరణు శంభో!
యంచు ప్రార్థింప నీ
రాగాంబోదము ధారతై కురిసి
ప్రారబ్ధాగ్ని చల్లార్చి తం
డ్రీ! గాసిల్లుట మాన్పి పంపెదవుగా
శ్రీ రాజరాజేశ్వరా! 14

ఒక పార్శ్వమ్మున అణురూపమయి
చెల్వొప్పన్ విలోకింప వే
రొక వంకన్ బురుషాకృతిన్ వెలసి
తోహో! సర్వలోకాల కీ
వొకడే తల్లివి దండ్రివై తనర నేమో
అర్ధనారీత్వమో
ర్చి కృపన్ దాల్చితివో జగత్ప్రభువరా!
శ్రీ రాజరాజేశ్వరా! 15

అవనిన్ నీవలె దైవమెందునను
లేడంచర్ధ నారీశ్వరుం
డవటంచున్ దలిదండ్రి నీవె యని
వేడ్కన్ నమ్మి నిన్నోక్కవిన్
స్తవమున్ జేసెద పార్వతీశుల నొగిన్
సంతృప్తులన్ జేయు న
చ్చివ మార్గమ్మిది యంచు బ్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా ! 18

భవదాద్యంతములన్ గనుంగొనుటకై
బ్రహ్మచ్యుతుల్ పూర్వ మె
న్ని విధాలన్ బడికొట్టుకున్న వశమున్
జీమంత కాదయ్యె మా
నవ మాత్రుండను నీదు మూలమెరుగన్
నాకెట్లు సాధ్యంబగున్
శివ! గౌరీధవ! కేశవార్చిత పదా!
శ్రీ రాజరాజేశ్వరా ! 19

హరి వక్షంబున లక్ష్మికిన్, వలువ
జిహ్వన్ వాణికిన్, స్థాన బం
ధుర మర్యాద నొసంగ నీవు నగ మే
నున్ గౌరికిన్ స్త్రీ సమ
త్వరమాన్యై భవమొప్ప నిచ్చితివి వా
హ్వా! నిన్ను బోల్దేవ డీ
స్థిరనెవ్వండు దలంచి చూడగ హరా!
శ్రీ రాజరాజేశ్వరా! 16

అతి సౌందర్య తనూ విలాసుడును
నిత్యానందు డంచెంచి యె
వ్వతెయైనన్ వరియించునేమొయని
సంభావించి యెవ్వేళ (బా
ర్వతి యర్ధాంగము నాక్రమించుటయు
దేవా! అర్ధనారీశ్వరా
కృతి వింపారగ దాల్చినాడవు గదా!
శ్రీ రాజరాజేశ్వరా! 17

మును త్రేతాయుగమందు రాఘవుడు నిన్
బూజించి కష్టాబ్ధి సీ
దెను నీదివ్యకృపా సహాయమున త
ద్రీతిన్ భవాంభోనిధిన్
నిను సేవించి తరింప నెంచితిని తండ్రీ!
మాకు నీకన్న మిం
చిన దేవుండెవడెంచి చూడఁబడమిన్
శ్రీ రాజరాజేశ్వరా! 20

అరి సంహారమొనర్ప జాలు నొక
దివ్యాస్త్రంబు నీయంగ శ్రీ
హరిచే గాక కదా కిరీటి నిను
సంప్రార్థించి మున్ శత్రుభీ
కరమౌ పాశుపతాస్త్రమున్ బడసె
నీకన్నన్ మహాదేవు డీ
స్థిర నెవ్వండయా! ఆశ్రితావన దయా!
శ్రీ రాజరాజేశ్వరా! 21

క్షీరాబ్ధిన్ దరచన్ జనించిన మహా
క్ష్వేళంబుమన్ ద్రావి దు
ర్వారాపద్దవ వహ్నిమాపి సురలన్
రక్షించితౌ నేడు సం
సారాంభోధి జనించు కష్ట విష
మాస్వాదించి నిత్యంబు తం
డ్రీ! రక్షింపవదేల మమ్ము దయతో
శ్రీ రాజరాజేశ్వరా 22

స్వామీ! నీపయి నిండు భక్తి
నరిషడ్వర్గాదులన్ నిత్యమున్
సామర్థ్యంబున గెల్చు శక్తి భవబం
ధక్లేశముల్ ద్రుంచి ని
త్యామోదంబును గూర్చుయుక్తి నిరతం
బవ్యాజ భూతోత్కర
ప్రేమాసక్తి నొసంగి ప్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 23

పరమార్థంబనిశంబు గోరుకొను మత్
స్వాంతాగ్ర కాసార మం
దరయన్ భక్తియనందనర్చ కమలం
బావిర్భవించెన్ దదం
బురహంబున్ గొని తావకాంఘ్రి యుగళిన్
బూజింతు నాపక్తి నన్
చిరకారుణ్యము తోడఁ బ్రోవగదవే।
శ్రీ రాజరాజేశ్వరా। 24

ప్రాజాపత్యము యౌవనంబు తనువున్
ద్రవ్యంబనిత్యంబు లౌ
సౌజన్యాకరమై తనర్చెడు భవత్
సాయుజ్యమే శాశ్వతం
బై జానొందు నటంచు నార్యులనగా
నాలించితిన్ గావునన్
జేజేల్ జేసెద దాని గూర్పగదవె।
శ్రీ రాజరాజేశ్వరా। 25

భవదీయాంఘ్రి సరోరుహామృతము
నాస్వాదించు నెవ్వండు వా
డవనిన్ పాపరుజా విముక్తుఁడయి
బ్రహ్మానందమున్ జెంది సం
స్తవనీయంబగు మోక్ష మార్గమును
గాంచన్ జాలు నంచెంతు నో
శివ ! మృత్యుంజయ ! భక్త చిత్త నిలయా !
శ్రీ రాజరాజేశ్వరా ! 26

సర్వ వ్యాప్తిని బొంది కన్పడక
రక్షన్ జేయు వాయుక్రియన్
సర్వంబీవయి గోచరించకయె
విశ్వంబెల్ల పాలింపఁగా
సర్వావస్థల సర్వవేళల భవత్
సౌజన్య కారుణ్యముల్
గీర్వాణస్తుత ! పొంగిపొర్లును గదా !
శ్రీ రాజరాజేశ్వరా ! 27

సకల ప్రాణులు సర్వకాలముల
విశ్వంబందున నీదు ప్రే
మకు పాత్రమ్ముల దెట్టు లన్నను
మహాత్మా ! రాతిలోనుండు క
ప్పకె నీర్వెట్టిన సత్కృపానిధివి
నీ పాదాబ్జముల్ గొల్చు వా
రికి దిక్కెందుకు చూపకుందువు శివా !
శ్రీ రాజరాజేశ్వరా ! 28

జననమ్మొందక ముందె బిడ్డ కొఱకై
స్తన్యంబులన్ దల్లికిన్
దనరన్ గూర్చిన ప్రేమ పూర్ణుడవు
నీ దాసానదాసుండ న
న్ననయం బేలుకొనంగ నీకు దయలే
దా నాపయిన్ లేక పే
ర్మిని నన్నేలుకొనంగ భారమగునా ?
శ్రీ రాజరాజేశ్వరా ! 29

పాలన్ ముంచిన నీట ముంచిన ప్రభూ ।
భారంబు నీదంచు నీ
పాలన్ జేరినవాడ నన్ను దయతో
పాలింప రాకున్న నా
కీ లోకంబున నీవుగాక పెరవా
రెవ్వారలున్నారలో ।
శ్రీ లక్ష్మీ రమణార్చితాంఘ్రియుగళా ।
శ్రీ రాజరాజేశ్వరా । 30

నిన్నే తల్లిగ దండ్రిగా గురువిగా
నే నమ్మికొన్నందుకున్
నన్నేలన్ దలపోయవైతి విది
యన్యాయంబగున్ గాదె ? ఆ
పన్నుండన్ దయనేలకున్న నిఁక
నెవ్వారేలు వారన్న ! కూ
ర్మిన్నన్వేగ కృతార్థు జేయగదవే !
శ్రీ రాజరాజేశ్వరా । 31

క్తై మోడ్పుల్ ఘటియించి నీ చరణ
యుగ్మశ్రీలపై వ్రాలి నీ
నామ స్తోత్రము జేయువాడను మదిన్
శంభూ! మహాదేవ! న
న్నే మార్గంబున నేలుకొందువొకొ
నాకీవే గదా దిక్కు శం
క్రీ! మృత్యుంజయ! దీనపాలనదయా!
శ్రీ రాజరాజేశ్వరా! 32

విరుపేదన్ శిథిలంబు నాగృహము
తండ్రీ! జీవితంబెన్న సా
గరమై యొప్పను దావియందు గల
వంతంబందె పంకేజముల్
విరియన్ బూచెను నీదు పూజకయి
సంప్రీతిన్ గటాక్షించి నా
చిరు కాన్కల్ గయికొమ్ము వేగమె ప్రభూ!
శ్రీ రాజరాజేశ్వరా! 33

గుండెల్ దల్లడ మొందగా నరిమి
చక్షుల్ నిండ వర్షించి హృ
త్ఖండక్షేత్ర విషాద దాహమిసుమంతన్
దీర్చలేకుండె నీ
యంతన్ జేరితి నీకృపామృతరసం
బశ్రాంతమున్ జిల్కి పే
ర్మిందెందబున్ దృప్తి జేయగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 34

వెతలం బొందుచు నుందుచున్ హృదయ
మన్వేషించు శాంతి ప్రస
న్నతకై కావి లభించదాయె
వీక్షనైనన్ ప్రేమతో నన్ను వి
స్తృత సంసార పయోధిదేల్చుచు సదా
స్వేచ్ఛా విహారమ్ముగా
ధృతిమీరన్ బ్రతుకంగ జేయగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 35

"శరశరణా! శరణంటి బ్రోవు" మని
మార్కండేయు దర్థింప స
త్కారుణన్ బ్రోచితి వందు రార్యులిది
సత్యంబౌనె? విన్గొల్చు నీ
శరణార్థిన్ ననుగావ వెందులకు
దోషంబేమి కావించితిన్
చిర కారుణ్య రసప్రపూర్ణ హృదయా!
శ్రీ రాజరాజేశ్వరా ! 36

భవదర్థంబు కుబేరు నొక్కనికె
సంప్రాప్తింపగా జేసినా
దవు నాకేమిడినాఁడ వేను తమ
బిడ్డన్ గానె? నా తండ్రి! నా
కవనిన్ పీపదధూళి విచ్చినను
బ్రహ్మానందమున్ జెందనే
శివ! వన్నేటికి చిన్నబుచ్చెదవయా!
శ్రీ రాజరాజేశ్వరా ! 37

కయిమోడ్పుల్ ఘటియించి నిన్ గొలుచునన్
గష్టాబ్ధిఁదాటించగన్
దయరాదయ్యెను నీకు నాపయిని
నీ దాసాన దాసుండ ని
ర్దయ నాపైతగునా దయార్ద్ర హృదయా!
రక్షింపవే పార్వతీ
ప్రియ! భవ్యాశయ! భక్తచిత్త నిలయా!
శ్రీ రాజరాజేశ్వరా! 38

పలుమార్లెంతగ నోరు నొవ్వగను
దేవా! యంచునిన్ బిల్చినన్
పలుకే బంగరమాయె నీ ఘనతకున్
భంగంబు వాటిల్లునో
అలుకన్ బూనితో! మారు పల్కవు
మహేశా! దోషమేమైన వ
ర్తిలెనో నాయెడలన్ క్షమించ వలదా!
శ్రీ రాజరాజేశ్వరా! 39

మా మూర్ఖచ్ఛేద విష్టసిద్ధికయి
మర్మంబేల నీశోద దు
ర్వ్యామోహంబున పాపముల్ సలిపి
పుణ్యప్రాప్తికై మ్రొక్కెదన్
నా మౌర్ఖ్యంబున కెంత నవ్వుకొనెదో!
నాలోని దోషాలు తం
డ్రీ! మన్నించి వివేక మీయగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 40

స్వామీ! తప్పొనరించ తండ్రి తనయున్
బావిన్ బడన్ ద్రోయునే?
వ్యామోహంబున దోషముల్ సలుప
కష్టాంభోనిధిన్ ద్రోతువే!
నే మూఢాత్ముఁడఁగల్మషాత్ముఁడను
తండ్రీ నన్ను మన్నింపవే!
శ్రీమద్వేములవాడ మందిర వరా!
శ్రీ రాజరాజేశ్వరా! 41

జగముల్ సేయగనేల? చేసితివిబో
సంసార పాశంబుతో
బిగియన్ గట్టగనేల? కట్టితివిబో
విజ్ఞానలోపంబు సే
యగనేలా? ఇదినీకు న్యాయమగునే?
అజ్ఞానమున్ బాపి వా
సిగ సుజ్ఞానము గూర్చి బ్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 42

పాలున్ బోసియు బెంచినంగఱచు
సర్పాలన్ ధరించన్ బ్రియం
బేలాగయ్యె? విషంబు మ్రింగగ
మనంబెట్లొప్పె? నా.రీతిగా
వాలో గల్గిన పాపహాలహాల
మూనన్ బ్రీతి చిత్తాన యే
లీలన్ లేదొకో! ఆశ్రితావన దయా!
శ్రీ రాజరాజేశ్వరా! 43

హిమవంతంబున శీత బాధ బడలే
కే వ్యాఘ్ర మత్తేభ చ
ర్మము లెన్నేనియు గప్పుకొన్న చలికా
రా! తట్టుకోనీకు సా
ధ్యమె? నా వెచ్చని గుండెలోపలను నీ
కత్యంతరంబేమి? పే
రిమితోడన్ వసియింపు చుండగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 44

క్షామ క్షోభిత లోకమందిపుడు
భిక్షంబెత్త నీకెట్లగున్
స్వామీ! నాయెద బీడు వడ్డయది
నీబల్ కోడెకున్ జోడుగా
వ్యామోహంబను కోడెనిచ్చెదను
సేద్యంబీవు సాగించుకో
క్షేమంబౌనుభయత్ర భక్త వరదా!
శ్రీ రాజరాజేశ్వరా! 45

ఎడదే నాటికి పూయకుండుటను
స్వామీ! రిక్తహస్తాల నీ
గుడికేతెంచితి పొగిలంబడి త్వ
దంఘ్రుల్ బట్టుకొన్నాడ వ్రే
ముడితో నన్ను కృతార్థుఁజేయుము
స్వయంభూ! శంఖలింగప్రభూ!
దృఢభక్తిన్ వినుగొల్తు మానసవిభూ!
శ్రీ రాజరాజేశ్వరా! 46

కడు కౌతూహలమూని విక్కముగ నా
కండ్లార విన్గాంచ నీ
గుడికేతెంచి త్వదీయమూర్తిగని
మ్రొక్కుల్ నీకు నర్పించు న
ప్పుడు నాకన్నులమోద బాష్పజలముల్
పొంగున్ దదీయాంబువుల్
చెడిపోవట్లభిషేక మూన్పవియవే,
శ్రీ రాజరాజేశ్వరా! 47

మదిలేకే చనుదెంచినాడను ప్రభూ!
మన్నింతువానన్ను! నీ
గుడికేతెంచితి రిక్తహస్తముల నన్
గూర్మిన్ గటాక్షింతువా!
యెదదే నీ గుడి దావిలో వెలయు వి
న్నారీతి సేవించుటో
మృడ! నా కయ్యది దెల్పి ప్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 48

దేవా! అల్పుడ విన్ను నేబొగడ
శక్తిన్ జాలమిన్ వేదనా
భావాంభోధము ధారలై కురిసి
సద్భక్తిన్ భవద్దివ్య తే
జోవంతంబగు పాదముల్ గడుగ
చక్షుల్ వింపునే కాని తం
డ్రీ! విశ్వేశ! కదల్పలేను పెదవిన్
శ్రీ రాజరాజేశ్వరా! 49

పదులెల్లన్ జనియించి నీరధిని
లీనంబైన చందంబు నీ
పద సాన్నిధ్యము జేరు మార్గమునె
జూపన్ పెక్కు ధర్మంబు లిం
పొదవన్ బుట్టె నదేదియైన విను
దివ్యున్ జేరనౌనంచు నెం
చెదనో వేములవాడ మందిరవరా!
శ్రీ రాజరాజేశ్వరా! 50

అరయన్ గాచిన పాలమీగడలు
రుచ్యంబౌనటే? ఖండశ
ర్కరపై ప్రీతి జనించునే? అమృతమే
ప్రాప్తించినన్ దాని మా
ధురిపై మక్కువ పుట్టునే? అభవ!
నీ స్తోత్రామృతాస్వాదియై
చిర సమ్మోదము నొందు జిహ్వకు హరా!
శ్రీ రాజరాజేశ్వరా! 51

జయ భాగ్యోదయా! చంద్రగోవరహయా,
సద్భక్త చిత్తాలయా!
నయ సమ్యక్రియా! శత్రులోక విలయా,
నానార్త రక్షాఽభయా!
భయశోకవ్యయా! నిష్కళంక హృదయా,
భవ్యాశయా! పార్వతీ
ప్రియా! నన్నేలుమయా! శ్రితావనదయా!
శ్రీ రాజరాజేశ్వరా! 52

శిరమందున్ మకుటంబుగా శశి విరా
జిల్లంగ నూరుస్థలిన్
గర మర్థిన్ గణనాథుఁడింపలర వే
డ్కన్ వామ భాగంబునన్
సరసాలాపను లాడుచున్ గిరిజ భా
స్వల్లీల వర్తిల్ల సు
స్థిర ప్రేమన్ గనుపింపవే గొలిచెదన్
శ్రీ రాజరాజేశ్వరా! 53

పులి తోల్గట్టి కరంబునందు మహితం

బున్ బట్టి కంఠాన పా

ములు వింపారగ జుట్టి మేనభసితం

బున్ బూసికొన్నట్టి నిన్

దిలకింపన్ దలపెట్టి నిత్యమును ప్రీ

తిన్ గొల్తు గాబట్టి భా

పిల జూపట్టి ముదంబు గూర్చగదవే।

శ్రీ రాజరాజేశ్వరా ! 54

ఎంతో దూరము నందున్న రవి

ఈడే కాంతిఁదానంత యెం

తెంతో దూరము నీకు నాకయిన

తంద్రీ ! జ్ఞాన సత్కాంతి మత్

స్వాంతంబందున భాసిలన్ నలిపి

యజ్ఞానాంధకారంబు నా

చింతల్ దీరగ బాయజేయ గదవే।

శ్రీ రాజరాజేశ్వరా ! 55

గదిలో చీకటి క్రమ్మికున్నటుల

నజ్ఞానాంధ కారంబు నా

యెదలో నంతట నిండి యుండెనిక

స్వామీ ! అంధకారంబు బా

పెద పంచుమ్మార నమ్మి యుంటివిగదా !

విజ్ఞాన దీపంబు నా

హృదయంబందు వెలుంగ జేయగదవే !

శ్రీ రాజరాజేశ్వరా ! 56

జ్ఞానం బించుక లేని నేను వినను

గాంచన్ శక్య మెట్లౌను? సు

జ్ఞానంబున్ దయజేసి నిన్ను గను

భాగ్యంబున్ ప్రసాదింపవే !

మౌనంబూనెదు మన్ను హొన్నగు నటుల్

మార్పన్ సమర్థుండ వ

క్షీణ ప్రాభవ ధుర్య ! నమ్మితిని నిన్

శ్రీ రాజరాజేశ్వరా ! 57

స్వామీ ! నీవె శరణ్యమంచు మది
సంభావించి దైన్యంబుతో
నా మూర్ధంబు భవత్పదాబ్జముల
సానన్ మోపి బాష్పంబు ధా
రా మాలిన్య మొనర్చువాఁడ నని
బల్ శంకించి కవ్వింపవా !
ప్రేమాపూర్ణున కిట్టి శంక తగునా !
శ్రీ రాజరాజేశ్వరా ! 58

ఈవా ! ధాత్రిన గోచరుండ వికఁ
విస్నేలీల సేవింతు నో
దేవా ! నేనొక యల్ప మానవుఁడ
సందేహాత్ముఁడన్ మూర్ఖుడన్
రావే ! దర్శనమీయవే వరములన్
ప్రాప్తింపగా జేయవే !
సేవింతున్ భవదీయ పాదయుగళిన్
శ్రీ రాజరాజేశ్వరా ! 59

నీవేమో కనరాక పోతివిఁక
తండ్రీ, మాకు దిక్కెవరు ? నీ
వీ విశ్వంబున నిండియుంటి విజ
మౌనేన్ విశ్వమే నీవుగా
భావింపం దగుగాన విశ్వజన
సేవా ధర్మమున్ విల్చి నీ
సేవా భాగ్యమొసంగి బ్రోవు మనవిన్
శ్రీ రాజరాజేశ్వరా ! 60

కనులేరీతిగఁ జూడగల్గును విరా
కారుండవౌ నిన్ను ? నా
మనమందున్ గల కోర్కె దీరగను
సూక్ష్మజ్ఞాన నేత్రంబు లి
చ్చిన మోదంబున నిన్ను గాంచి సతమున్
సేవించెదన్ నిందు కూ
ర్మిని నీదర్శన భాగ్యమీయగదవే !
శ్రీ రాజరాజేశ్వరా ! 61

"దురహంకారులకేను గన్పడిన
నాతో గూడి తీయించు కొం
దురు ఛాయా పటమంచు" గన్పడవు
మాతో నుంట నామోషియో
నరె ! నీ వేరికి గానుపించకను
మా స్వాంతంబులందాగి సు
స్థిర వాసంబొనరింపు చాలునదియే
శ్రీ రాజరాజేశ్వరా ! 62

నీవే విశ్వము విశ్వమంతయును
నీవే కాన నీదివ్య తే
జో వంతంబగు శిల్పికల్పిత కళా
సూక్ష్మంబులో లీనమై
నీ విశ్వాకృతి నిండియుండదెటు ?
నిన్నే నమ్మి కై మోడ్పుచున్
సేవింతున్ భవదీయ మూర్తిని హరా !
శ్రీ రాజరాజేశ్వరా ! 63

నీవే తోడువు నీడవంచు మదిలో
నే నమ్మియున్నాడ నన్
గావన్ దర్శన మీయవైతి విఁక
ఈ కాయంబు నిత్యంబుగా
భావింపందగదాయె విన్గను మహా
భాగ్యంబు నీ జన్మలో
శ్రీ విశ్వేశ్వర నాకు గూర్పగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 64

ప్రాపెల్లిప్పుడు నాకునీవెయని సం
భావించి సద్భక్తితో
నీపై పద్యములెన్ని వ్రాసిన కృపన్
నీ వాక్కుమారైన న
న్నాపన్నున్ దయఁ బ్రోవ గన్పడవు
న్యాయంబౌనె? నాయందిటుల్
శ్రీ పుత్రారి! పరాకు సేయతగునా!
శ్రీ రాజరాజేశ్వరా! 65

భూమిన్ నే గనుపించగా జనులు
గుంపుల్ గూడి విచ్చేసి ఏ
మేమో కోర్కెలు కోరుచుందురవి
నీ వీ లీల గావించవా !
స్వామీ ! కన్పడకున్న వీడనిక నే
సత్యాగ్రహం బూనెదన్
ప్రేమన్ దర్శనమిచ్చి ప్రోవగదవే !
శ్రీ రాజరాజేశ్వరా ! 66

స్వామీ ! నీవొకవేళ గన్పడినచో
శంభూ ! స్వయంభూ ! ప్రభూ !
వేములాడ పురీవిభూ ! శరణమీవే
యంచు వేమారు తం
డ్రీ ! మోదాశ్రు జలంబులన్ గడిగెదన్
నీపాద పద్మంబులన్
ప్రేమన్ దర్శనమిచ్చి ప్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా ! 67

ఈ విశ్వంబున వింతియున్న ఘను
నిన్నే మాత్ర మెఱిఁగేవి నే
నేవేళన్ గనన్నైతి నజ్ఞుడను
వింతేకిఁతి నిన్ జూతు దే
వా ! విశ్వేశ్వరు నిన్ను గాంచుటకున్నై
స్వాంతంబు కాంక్షించె నా
నేవళ్ గైకొని దర్శనంబిడగదే !
శ్రీ రాజరాజేశ్వరా ! 68

కలికాలంబిది నీవు గన్పడని కో
గారీపడున్నట్లు లో
కులు సుంతైనను నమ్మజాలరు ప్రభూ !
కోపించకీమాటకున్
వెలుగే లేనపుడెట్లు నమ్మనగు
సుర్యున్ సూర్యుఁడున్నట్లు బా
పిల గావ్పించిన శంక పైదొలగదే !
శ్రీ రాజరాజేశ్వరా ! 69

నను గష్టాబ్ధి తరింపజేయుమనివిన్

నానా విధాలన్ స్తుతిం

చిన నన్నోమక మౌన మూనెదవు తం

డ్రీ ! నీకు న్యాయంబదే !

జనకుండాత్మజు కష్టముల్ గని భరిం

చన్ గల్గునే ? నన్ను కూ

ర్మివి గావన్ దడవేల జేసెదు ప్రభూ !

శ్రీ రాజరాజేశ్వరా! 70

విశ్వంబేక కుటుంబమై వెలయుచున్

విశ్వప్రజల్ సర్వదా

విశ్వప్రేమకు తావలంబగుచు

నుర్వింగాంచఁదోబుట్టులై

విశ్వాసం బెడదన్ దలంచి నెగడన్

విజ్ఞానులై వర్ధిలన్

విశ్వశ్రేయము గూర్చి ప్రోవుమనవిన్

శ్రీ రాజరాజేశ్వరా ! 71

స్వామీ ! నీ మహిమోన్నతుల్ ప్రకటమౌ
చందంబునన్ నేటి యీ
క్షామక్షోభ దవాగ్నులార్పగ సుభి
క్షంబేర్పడన్ లోక సం
క్షేమార్థంబు భవత్కృపామృత రస
శ్రీ వృష్టి వర్షింపవే
శ్రీ మద్వేములవాడ మందిరవరా !
శ్రీ రాజరాజేశ్వరా ! 72

క్షీరాంభోనిధి మధ్యమించిన సిరిన్
జేపట్టెనే కాని దు
ర్వారక్ష్వేళము వంటగా గలిగెనే
పద్మాక్షు డొక్కింతయే
నౌరా ! చేదు హరించి లోకముల
ప్రేమాసక్తి రక్షింప గా
రి రామాధిప ! నీకె చెల్లెను గదా !
శ్రీ రాజరాజేశ్వరా ! 73

ఏమో యింత విషంబు మ్రింగుట ఘనం
బెట్లౌనొకో ! యిప్పుడీ
కామక్రోధ మదప్రలోభ దుర హం
కార ప్రపంచైక సం
గ్రామాణ్వస్త్రి మహాహలాహలము మ్రిం
గన్ జాలుచో మాకు నీ
స్తేమా స్తోమతలర్థమౌను గిరిశా !
శ్రీ రాజరాజేశ్వరా ! 74

కొండపై నీ వెసగన్ సతీ సుతులతో
గూర్చుండి యున్నప్పు డిం
పలరన్ గోవర సింహ మూషక శిఖి
వ్యాళంబులున్ మీ కడన్
జెలిమిన్ వర్తిల జేసినట్లు జనులన్
స్నేహంబునన్ ధాత్రి వ
ర్తిలఁ జేయంగదె కేశవార్చిత పదా !
శ్రీ రాజరాజేశ్వరా ! 75

సుకుమారున్ కుసుమాయుధున్ వలపురాజున్
భగ్గునం గాల్చి వం
దుకు లాభంబు హాళక్కి మానవుల యందున్
నేడు వ్యామోహమన్
వికటోన్మాద మదోత్పథైక మదనున్
విధ్వంసమున్ జేసి ధా
ర్మికులన్ బ్రోచిన సార్థకంబగు హరా !
శ్రీ రాజరాజేశ్వరా ! 76

కుల వైరమ్ములతోడ గ్రుద్దుకొను
మూర్ఖుల్ సంఘ విధ్వంసకుల్
గలరంచున్ వినుమాట పాతబడి పోగా
నేడు పార్టీ కులా
లిల రేకెత్తెను శీలమే కులముగా
వృద్ధిన్ గనం జాలి బల్
జెలిమిన్ గూడి జనుల్ సుఖించు టెపుడో !
శ్రీ రాజరాజేశ్వరా! 77

వరకట్నాల గిరాకి హెచ్చె. పదవీ
వ్యామోహమా రెచ్చె. సో
దర భావంబది చచ్చె, మానవత
విధ్వంసంబు గావచ్చె. దు
ర్భర దారిద్ర్యము జాతి నెల్లఁగబళిం
పంజొచ్చె. సామాన్య దీ
స్థిర సౌభాగ్య సుఖార్థి దేలు చెపుడో !
శ్రీ రాజరాజేశ్వరా ! 78

అరెరే ! అక్రమ నిక్రమంబున
స్వలాభార్జుల్ సిరుల్ మూటగ
ట్టిరి, పేదల్ నిరుపేదలైరి, కలయుండ్లే
శ్రీలతో నిండె. న
ల్గిరి మధ్యస్థులు సాంఘికార్థిక మహా
క్లేశంబుఖంజిక్కి. ఈ
స్థిర షోకార్పెదికెప్పు డీ అసమతల్
శ్రీ రాజరాజేశ్వరా ! 79

ఎల్లెట్లా ? పద వుల్ గడించుటకు
నోట్లీకున్న వోట్లీయరా ।
ఇల్లెట్లైనోకొ ! విచ్చగాదవట నీ
వేమీక లోకేశుగా
నెల్లెల్లైతివొ ! తద్రహస్యము నొకిం
తేన్ దెల్పి మానందియాల్
సిల్లన్ గొట్టుచు జాడ జూపగదవే ।
శ్రీ రాజరాజేశ్వరా । 80

మతమంచున్ గితమంచు కొందరు మతో
న్మాదంబుతో నేడు దు
ర్మత కీలన్ రగులంగ జేయుచు కుతం
త్ర ప్రజ్ఞతోడన్ ప్రజా
హితమౌ శాంతి సుఖంబులన్ జెఱుతురిం
కీ ధాత్రిపై నీవు స
త్కృత మే సన్మతమంచు నేర్పగదవే ।
శ్రీ రాజరాజేశ్వరా । 81

ప్రకటింపన్ మదినొప్పు నొక్కొకడు
ధర్మ ద్వేషియై శాంతి ఘా
తకుడై పాతకుడై దురాక్రమణ చిం
తాస్వాంతుడై ఘోర వం
చకుడై నాస్తికుడై స్వలాభ పరుడై
జ్ఞానాంధుడై భూత ధా
త్రికి భారంబగు దాని మాన్ప గదవే।
శ్రీ రాజరాజేశ్వరా। 82

కొల్లం గొట్టుట కుట్ర పన్నుటయు
మూర్ఖుం డున్నతోద్యోగమున్
జెల్లంబొందుట దంబుసూపుట ప్రజా
క్షేమాని కౌ ద్రవ్యమున్
దుల్లం జేయుట నోట్లు కోట్లిడుట
నేడున్ లోకులం దెన్న వ
ర్థిల్లెన్ వాటి నడంచి ప్రోవుమవనిన్
శ్రీ రాజరాజేశ్వరా। 83

ఒకఁ డన్యాయము జేసి ముందుపడు
వేరొక్కఁడు స్వార్థియై
వికట ప్రక్రియలన్ స్వదేశమునె
దుర్భిక్షంబు గావించు నిం
కొకఁడు ర్వీస్థలి శాంతి భంగకరమౌ
యుద్ధాగ్నులన్ రేపు ధా
ర్మిక లోకంబుల గావుమయ్య కృపతో
శ్రీ రాజరాజేశ్వరా ! 84

తలపన్ సంఘ విఘాత పాతక కుతం
త్ర స్వార్థ ఘాతాలు వ
ర్ధిలుచున్ నీతి నడంచి పెట్టి అవి నీ
తిన్ బెంచి దౌర్జన్య కీ
లల శాంతిన్ బడద్రోసి న్యాయమును
నేలన్ గల్పి ధాత్రీ స్థలిన్
జెలరేగెన్ గరుణించి ప్రోవుమవనిన్
శ్రీ రాజరాజేశ్వరా! 85

పాలన్నీళ్ళను గల్పి విక్రయమొనర్పన్
పాపమంచెంచు స
త్కాలంబిప్పుడు మారిపోయినది
యీ కాలంబులో నీళ్ళలో
పాలంగల్పెడు నేర్పుతో నెగడు
వ్యాపారంబులున్ సాగె దు
శ్శీల ధ్వంస మొనర్చి ప్రోవుమవనిన్
శ్రీ రాజరాజేశ్వరా । 86

పాలం ద్రావుచు కండ్లు మూసికొని
యెవ్వారిందు లేడంచు మా
ర్జాలం బెంచియు ప్రేటులన్ దినిన
లీలన్ పాపముల్ సల్పువా
రీ లోకంబున నెందరో కలరు
విన్నేమార్కి కన్గప్ప నౌ ॥
శ్రీ లక్ష్మీరమణార్చితాంఘ్రియుగళా ।
శ్రీ రాజరాజేశ్వరా । 87

కప్పన్ మ్రింగెడు పాము తాను తలపై
గ్రద్దన్ గనం జాలవ
ట్లిప్పట్లీ ధర దీనమానవ తతిన్ హిం
పించు దుష్టాళినీ
విప్పల్ గ్రక్కు లలాట నేత్రభయమేవిన్
గాంచ లేరైరిగా
జెప్పంగా వశమే భవన్మహిమముల్
శ్రీ రాజరాజేశ్వరా ! 88

కరుణా రాశి వసంతభూత తతి .
రక్షాదీక్ష బద్ధుండవై
స్థిరపై దీనుల వేచు దుష్టజనులన్
శిక్షించుచున్ సజ్జనో
త్కరమున్ రక్షణజేసి కూరిమి జగ
త్కల్యాణమున్ గూర్పవే ;
చిరభక్తిన్ వినుగొల్చెదన్ శుభకరా!
శ్రీ రాజరాజేశ్వరా ! 89

కరియంచున్ కరిమోము వాఁగవి
శంకన్ బూవి లంఘించు కే
సరి నాత్రంబున నాపుఁ నీ వృథుల వా
త్సల్య ప్రవాహంబు వి
ద్ధరరావిమ్మటురాక యుండిన ప్రభూ!
దౌర్జన్య దావాగ్ని చె
చ్చెర దగ్ధంబొనరించు శాంతి వనమున్
శ్రీ రాజరాజేశ్వరా! 90

అరెరే! పిచ్చుకమీద ఘోరమగు
బ్రహ్మాస్త్రప్రయోగంబటుల్
మరునన్యాయముగా దహించుటొక
సామర్థ్యంబె ఈనాడు మా
భరతోర్వింగల లేమిరక్కసివి
కాల్పంజాలినంగావి నీ
స్థిరసామర్థ్యమెఱుంగలేవు జగమున్
శ్రీ రాజరాజేశ్వరా! 91

ఒకడుచ్ఛస్థితినొంద నీర్ష్యదన దే
మోమూట వోఁగొట్టుకు
న్నక్రియన్ మిక్కిలియేడ్పువింకొకడు దై
న్యత్వంబునుం జెందవే
డుకగా పండ్లికిలించుచున్ నగుచునుండున్
వాని శిక్షించి ధా
ర్మికమార్గంబున బెట్టుమో। హరహరా।
శ్రీ రాజరాజేశ్వరా ! 92

అపకారంబిసుమంతఁ జేయక
జలంబందుండెడు మీనంబులన్
కపటోపాయము బన్ని జాలరులు
వీఁకన్ జంపు చందంబునన్
కుపథుల్ స్వార్థపరుల్ సుధీమణుల
కెగ్గున్ జేతురెల్లప్డు న
త్కృప శిష్టావనమీవె చేయగదవే।
శ్రీ రాజరాజేశ్వరా ! 93

పమవిద్రోహమొనర్చినన్ దినకరున్
చండాంశుడంచొక్కమా
రుమృగాంకున్ హిమధాముడంచు పలు
మారుల్ మ్రింగు గాముల్ విరో
ధము లేకున్న దరిద్రమన్ గ్రహము
బాధల్ పెట్టు నెవ్వేళ నో
రిమి చిత్తంబుగ లారటంచు కవులన్
శ్రీ రాజరాజేశ్వరా ! 94

ఫణి బల్పెక్క విషంబు వర్ధిలినటుల్
పాపాత్ము డైశ్వర్య మొం
దిన దుష్టత్వము రెచ్చిపోవు, గవి వృ
ద్ధిన్ జెందు క్షీరంబు హె
చ్చిన చందంబున పుణ్యవంతుడు సిరుల్
జెన్నొంది వర్ధిల్ల దా
త్రివి సత్కర్మలు దండిగా పలుకదే!
శ్రీ రాజరాజేశ్వరా ! 95

అకటా! పాపి సుఖించగా సుకృతి
దైన్యంబొందె నోరువ్న వా
నికె ఊర్వేరుల దక్కె పండితుడు
గానీ నోరులేకున్న గ
వ్యకునైనన్ గౌరగాకపోయె విౘక
దేవా! న్యాయమున్గూర్చి ధా
ర్మిక లోకంబును సంతరింపగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 96

మరునిన్ గాల్చితివన్న మాటవిని
నమ్మం జాలకున్నాడ నీ
హరువున్గాంచి సహించలేక మరుదే
అట్లౌట నీర్ష్యాగ్నికిన్
పరమేశా! నవమన్మథాకృతునిగా
వానిన్ గటాక్షించి సు
స్థిర దాక్షిణ్యము జూపినాదవుగదా!
శ్రీ రాజరాజేశ్వరా! 97

కలలో గన్పడు భోగభాగ్యములు
నిక్కంబౌనె? తద్రీతిగా
ఇలలో సంపదలెన్నిగల్గిన స్థిరంబే?
జీవితాంతాన ని
శ్చలమైనట్టి పరార్థమొక్కటి దయన్
సంప్రాప్తమున్ జేసి య
ర్మిలి రక్షింపవె! కేశవార్చిత పదా,
శ్రీ రాజరాజేశ్వరా ! 88

ఈవే దేవుఁడ వీవెరక్షకుఁడ
వీవే ప్రాపు నాకంచు ని
న్నే వర్ణింప సమస్తమబ్బునని యెం
తేన్నమ్మి పేరాశతో
నీ వాత్సల్యము నొంద నీ శతకమున్
నేవ్రాసితిన్ గావి తం
డ్రీ! వాగ్ప్రౌఢిమ నీకు జూపుటగునా?
శ్రీ రాజరాజేశ్వరా। 89

స్వామీ! నీవె శరణ్యమంచు మదిలో
భావించి కైమోడ్చితిన్
కామక్రోధ మదప్రలోభ రిపు వర్గ
ధ్వంసమున్ జేసి వ
న్నె మార్గంబున నేలుకొందువో దయాబ్ధీ!
నాకు దిక్కువెగా!
శ్రీమద్వేములవాడ మందిరవరా!
శ్రీ రాజరాజేశ్వరా! 100

పరమాత్ముండ వటంచు నిన్నెపుడు నే
భావించితిన్ గావునన్
స్థిరపై లోకుల వేచు క్రూరమృగ
జాతిన్ రాజు వేటాడి ప
త్కరుణన్ మర్త్యుల నుద్ధరించు క్రియ నా
కష్టంబులన్ బాపి సు
స్థిరసౌఖ్యంబుల గూర్చి ప్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 101

కవితాంబోధి తరంగితోజ్జ్వలమృదంగ
ధ్వానసంగీత సం
భవ సంకీర్తన గానకేళి విను సల
భావించి యెవ్వేళ సం
స్తవమున్ జేతు కృతార్థుఁ జేయగదవే।
శంభో। మహాదేవ। శ్రీ
శివ। గౌరీధవ। కేశవార్చిత పదా।
శ్రీ రాజరాజేశ్వరా । 102

ఓ గంగాధర! ఓ సుధాకరధరా!
ఓ సర్వలోకేశ్వరా,
ఓ గంభీర దయాకరా! శుభకరా!
ఓ భక్త మందార! నా
వాగాడంబరమున్ క్షమించి కృపనన్
పాలింపరావే కప
ర్ది! గౌరీహృదయేశ్వరా! హరహరా!
శ్రీ రాజరాజేశ్వరా । 103

మమతన్ వస్త్రములట్లు నీవు విలస

న్మత్తేభశార్దూల చ

ర్మములన్ దాల్పుటచే ప్రియంబులని నే

మత్తేభ శార్దూల వృ

త్తములన్ భక్తిరచించి యీ శతక

మాస్థన్ నీకు నర్పింతు కూ

రిమితో మత్కృతి స్వీకరింపగదవే!

శ్రీ రాజరాజేశ్వరా ! 104

నామంబెన్నగ కేశవుండ నవనిన్

రామాంబికా జానకీ

రామాచార్యుల కగ్రనందనుడ

శ్రీరంగాపురీధాముడన్

కైమోడ్తున్ భవదీయ పాదములకున్

కామ్యార్థముల్ గూర్పవే!

శ్రీ మద్వేములవాడ మందిరవరా!

శ్రీ రాజరాజేశ్వరా ! 105

భవకష్టాబ్ధిఁ దరింపజేయుమని విన్
ప్రార్థించి భక్తాళికిం
పవు రీతిన్ రచియించి యీ శతకమే
నర్పించితిన్ గావునన్
భవదత్యంత కృపాసుధారసము నా
పై జిల్కి రక్షింపవే।
శివ। గౌరీధవ। కేశవార్చిత పదా।
శ్రీ రాజరాజేశ్వరా । 106

ప్రతి పద్యంబును నీదు నామ మకుట ప్రా
ప్తిన్ విరాజిల్ల స
త్కృతి గాకుండునె? తావిగల్గిన సుమం
బే కాదె చెన్నారు మ
త్కృతి యట్లొప్పదె? దీని గైకొనగదే।
ఈశా జగద్రక్షకా।
క్షితి నీనామ మహత్త్వమెన్నవశమే।
శ్రీ రాజరాజేశ్వరా । 107

శ్రీ మన్మంగళ దాయకంబయిన నీ
శ్రీపాదయుగ్మంబు హృ
త్పీమన్ పీఠక నిల్పి సంతత ముపా
స్తిన్ జేయుచున్నట్టి నా
కామోదంబున కామితార్థము లమే
యస్ఫూర్తి జేకూర్చి సు
క్షేమానుగ్రహ ధామ! ప్రోవగదవే!
శ్రీ రాజరాజేశ్వరా! 108

కృతి మాకిచ్చి ధనంబుకై నరుల న
ర్థింపంగ నీకెట్లు స
మ్మత మయ్యెన్? కవి సంప్రదాయ మగునా
మాపైని విశ్వాసమే
పతనంబయ్యెన! నీకు కేశవ కవీ!
భద్రంబటంచున్ మదీ
ప్సితమున్ దీర్చుచు మందలించితివిగా
శ్రీ రాజరాజేశ్వరా! 109

చెలరేగెన్ పెనుగాడ్పు కల్పతరు గూ
ల్చెన్ చిత్తశోకాగ్నియున్
జెలరేగెన్ బ్రవహించె బాష్పజలముల్
నేత్రాంబుధుల్ వీంది పొం
గులు గ్రక్కన్ దెగిపారె నే నిలువ లే
కున్నాడ నీవాడ, నీ
విలయంబున్ గవినాడ గావగదె నన్
శ్రీ రాజరాజేశ్వరా ! 110

ఎదలో దుఃఖదవాగ్ని రేగినది అం
దే నిల్పుకొన్నట్టి నీ
పదపద్మంబులు గాలునేమొయని బా
ష్పాంభోనిధుల్ మ్రింగినన్
మదిలో నగ్ని శమింపదయ్యె వీఁక న
న్మన్మాత కీ వాత్మకాం
తి దయల గూర్చుచు నూరడింపగదె నన్
శ్రీ రాజరాజేశ్వరా ! 111

ఏఁ రాలేదిటు విన్నజూఁడగను ప్ర
త్యేకంబుగా నైన యే
దో రాజ్యాంగపు "టూరు" పెట్టినను యెం
తో ప్రీతితో సివె సీ
వే రప్పించితి దర్శనంబిడితి సీ
ప్రేమాంత రంగాలయ
శ్రీరాజిల్లుచు మాకు చోటొసఁగుగా
శ్రీరాజరాజేశ్వరా । 112

నేనెవ్వండను? నన్ను నేనెరుగఁ వి
న్నేలీల గుర్తించెదన్
నేనెందుండిట వచ్చినాడ? విట నుం
డెందేగనున్నాడ? నా
సావంబెయ్యది నేనెరుంగని(క సీ
స్థానంబు గుర్తించ శం
క్రీ। నాకౌనె? ఎరుంగఁదెల్పగదవే ।
శ్రీరాజరాజేశ్వరా । 113

పై మీదన్ బుసగొట్టుచున్ భుజగముల్
పొరాడినన్ గావి గం
గోమా భామలు పోరుపెట్టుకొని యెం
తో యుగ్గినంగూడ నీ
వేమాత్రున్ దపమాచరించెదొ! క్షణం
బేన్ నిగ్రహంబూనగా
చీమైనన్ జిటుకన్న మాకు వశమా,
శ్రీ రాజరాజేశ్వరా! 114

తెరపింకేది సమస్త వస్తువులు క
ల్తీలయ్యె. ద్రవ్యోల్బణం
బురుదావానలమయ్యె పేదబ్రతుకుల్
హోత్రంబులై పోయె నం
బరమంటన్ ధరలన్నియున్ బెరిగె. క్షా
మక్షోభఁ జల్లార్చి సు
స్థిరతన్ ధాత్రిఁ సుభిక్ష మేర్పరుపవే,
శ్రీ రాజరాజేశ్వరా! 115

అరెరే! కోట్ల జనమ్ము కూటికొఱకై
అల్లాడుచుండంగ కొం
దరు స్వార్థమ్మున ధాన్యరాసుల కుతం
త్రప్రజ్ఞతో దాచి దు
ర్భరమౌ క్షామదవాగ్ని రేపెదరు స్వా
ర్థప్రేతమున్ బాపి యీ
స్థిరపై క్షేమము గూర్పుమో! శుభకరా!
శ్రీరాజరాజేశ్వరా! 116

అరెరే! మోసముతో అమాయకుల న
న్యాయంబుగా దోచుకొం
దురు లేఁదూడను జంపి కృత్రిమముగా
దూడన్ దగన్‌జేసి ముం
దర జూపెట్టుచు పాలుపిండుకొను చం
దంబయ్యె. స్వార్థప్రియుల్
స్థిరపై రేగిరి చూడవేటికి హరా!
శ్రీరాజరాజేశ్వరా! 117

అకటా! నేడవినీతి ఖడ్గమున స్వా
ర్థాపేక్షతో సంఘ ఘా
తకియై పేదల గుండియల్ జెనకి ర
క్తా స్వాదియైనట్టి ఘా
తకి పూతాత్మగ మారుటెప్పుడొ కదా!
దావిన్ వేగదండించి ధా
ర్మికమార్గంబునఁ బెట్టుమో! శుభకరా!
శ్రీ రాజరాజేశ్వరా! 118

అకటా! కంచెయె చేను మేసె, తిమిర
వ్యాపారపారీణ ఘా
తుక ధూర్తాదిదురాగతోద్ధతులకున్
తోడ్పై ప్రలోభాన ర
క్షకులే భక్షకులైరి కొందరిలలో
శంభో మహాదేవ! ధా
ర్మికలోకంబుల నుద్ధరింపుము ప్రభూ!
శ్రీ రాజరాజేశ్వరా! 119

స్వార్థార్థుల్ వరశుల్క కాముకులు దు
రావేశపార దుశ్చింతఁ వి
స్వార్థస్వాంత వధూజనంబుల యథేచ్ఛన్
దోచి హింసించ న్యా
యార్థంబై శరణన్నవారి మొర నిం
తైనన్ విననీరాని నీ
విర్దాక్షిణ్య మదేల ? బ్రోవుమవనిన్
శ్రీరాజరాజేశ్వరా ! 120

ఒకడంతస్తుల మేడ గట్టుకొన వే
రొక్కండు పూరిల్లు గ
ట్టుకొనంగన్ గతిలేక తా బ్రతుకు నీ
డ్పున్ మంది కొంపల్ల న
డ్డెకు ఆమాత్రము లేక ఇంకొకడు వీ
ధిన్ బండి పొర్లాడు నా
ర్థిక భేదంబులు బాపుమో హరహరా !
శ్రీరాజరాజేశ్వరా ! 121

ఇక నీకేమని విన్నవింతును ప్రభూ ।
ఈ మా సమాజంబు నం
దొక దల్లాడును కూటికోసమయి వే
రొక్కండు తిండెక్కువై
వికట ప్రక్రియ హుంకరించు సమతా
విర్భావ సౌజన్య ల
క్ష్మికి చోటెక్కడ గానుపించదుకదా !
శ్రీరాజరాజేశ్వరా । 122

ఇలపై దీనుల నుద్ధరింపుము దయా
బ్ధీ । పాత చింపుళ్ళ గు
డ్డల వాడెవ్వడొ డొక్కలార్చుకొని గుం
టం బడ్డ ఉచ్ఛిష్ట దు
ర్మలినంబౌ కబళంబు కోసమయి పో
రాటంబు సాగించి ప్రము
చ్చిలు చుండెన్ శునకాలతో శివశివా ।
శ్రీరాజరాజేశ్వరా । 123

అకటా ! గద్దెకు గ్రుద్దులాట పదవీ
వ్యామోహమా జాతి న
డ్డుకు బట్టించె, సమత్వ భావమది ప
ట్టుం దప్పె, సామాజి కా
ర్థిక భేదంబులు బాధకంబులయి వి
జృంభించె, లోకాల కే
లికపై యింత పరాకు నీకు తగునా !
శ్రీ రాజరాజేశ్వరా ! 124

సకలజ్ఞుండవు నీ వెరుంగవె ప్రపం
చంబందువన్నెడు వం
చకు డొక్కొక్కడు గద్దెకెక్కి జన హిం
సాకాండ గావించు ఘా
తుకుడిం కొక్క డమాయక ప్రజల గొం
తుల్ నొక్కు, లోకాల కే
లికపై ఏల పరాకు సేతువు దొరా !
శ్రీ రాజరాజేశ్వరా ! 125

యుద్ధోన్మాదముతో దురాక్రమణ మొ
కొక్కండు సాగించు దు
ర్బుద్ధిన్ లోక వినాశకుండొకడు వాం
ఛల్ సృష్టి గావించు విం
కిద్ధాత్రిన్ సుఖశాంతులన్ నిలుప నీ
దే భారమై యుంట నీ
సిద్ధాంతంబెరిగించి ప్రోవు మవనిన్
శ్రీరాజరాజేశ్వరా ! 126

మూల్లోకంబులనేలు వేల్పువుగదా !
భూలోక మిప్పట్టులన్
కల్లోలంబుల మున్గుచున్న యది సం
గ్రామాంబు రాశిస్థలిన్
దెల్లంబేగద నీకు నత్కృప నశాం
తిన్ బాపి లోకంబు వ
ర్థిల్లన్ జేయుచు సంతరించగదవే !
శ్రీరాజరాజేశ్వరా ! 127

భరతోర్వీతల మాక్రమించుకొన
పై పై భ్రాతృ మిత్రత్వముల్
బరగన్ బల్కుచు పొంచి పొంచి హిమ
శైలంబందు దండెత్తుచున్
నరకన్ బైబడు వంచకాధముల కిన్కన్
ఫాల నేత్రాన చె
చ్చెర వీక్షింపవదేల శత్రు విలయా!
శ్రీరాజరాజేశ్వరా! 128

వృకముల్ మేకల కాపుగాయునటు
లుర్విన్ కొందరీనాడు ర
క్షకులై భక్షకులైన లోకమిది విన్
శంకించు లోకైక ర
క్షక! డీవాటము పేక్షమాని పరి
రక్షాదక్షతన్ జూపి ధా
ర్మిక మార్గ బున బెట్టు మీ కుపథులన్
శ్రీరాజరాజేశ్వరా! 129

మొదటన్ దగ్గర జేరి రాగరవళిన్
ముమ్మారు విన్పించి ఆ
పిదపన్ దద్దులువోవ మేన్గరచుచున్
పీడించు దోమక్రియన్
పదముల్బట్టి కృతార్థుఁడైవ పిదపన్
భస్మాసురుండౌను చే
సెద నీ సేవలు ధూర్తు బారి దొలగన్
శ్రీరాజరాజేశ్వరా ! 180

మాటల్ కోటలు దాటునట్లుగను
డంబాల్గొట్టి బీద ప్రజా
కోటిన్ స్వర్గ సుఖాల దేల్తుమని
ఉద్ఘోషించి నమ్మించియున్
సీటున్ బొందిన పిమ్మటన్ మరతురేన్
ఛీ అట్టి వాగ్డంభముల్
సీటన్ వ్రాసిన వ్రాలుచందమనరా !
శ్రీరాజరాజేశ్వరా ! 181

కలి భస్మాసురులెందరో కలరు
సాక్షాత్కారమీకూడ దం
చిల గావ్రించవ మాకు? అట్లయిన
స్వామీ! విష్ణురూపాన మా
కెలమిన్ దర్శనమిచ్చి మానవుల యం
దీదైత్యులన్ దూరి రం
జిల శిష్టావన సేయవే! హరి హరా!
శ్రీ రాజరాజేశ్వరా! 132

తన దౌర్భాగ్యవశాన వెంటఁబడి
రత్నంబక్కటా! స్వీయ కాం
తిని గోల్పోయి తపించ కోడి విదలించెన్
కాలితో గింజకా
దని తద్రీతి దశావిహీనతను
దైన్యంబొంది యోగ్యుండు దా
త్రిని అల్పజ్ఞునిచేత భంగపడుగా!
శ్రీ రాజరాజేశ్వరా! 133

స్వామీ ! విశ్వ కుటుంబమందొకఁడ
విశ్వ క్షేమమే మామక
క్షేమంబంచు మదిన్ దలంచి భువన
క్షేమార్థ మర్థింతు న
త్యామోదంబున దానిగూర్పవె !
మదీయాభీష్ట మీడేరగన్
శ్రీమద్వేములవాడమందిరవరా !
శ్రీ రాజరాజేశ్వరా ! 134

భువిలో దావక చారు విగ్రహములన్
పూజార్థమై నాస్తిక
త్వ వినిర్మూలనకై వృజింపుచును వి
శ్వశ్రేయమున్ గూర్చు సం
స్తవనీయంబగు విశ్వకర్మకుల సం
జాతుండనై మంజు కీ
ర్తి విరాజిల్లిన కేశవాఖ్యుడ వ్రభూ
శ్రీ రాజరాజేశ్వరా ! 135

శ్రీరంగాపురి వాసులౌచు వనప
ర్తిన్ రాజు వెంకన్ సదాఽ
చారోదార పరోపకారులయి వి
శ్వబ్రహ్మ వంశీయులై
ధీరాగ్రేసరులై ధనాఢ్యులయి
ఫోతేదారులై సద్యశ
శ్రీరంజిల్లిరి నాడు పూర్వీకులు మున్
శ్రీరాజరాజేశ్వరా । 136

ఇలలో భోగములెల్ల నమ్మికొని నే
నేవేళ నిన్ భక్తిమై
తలపన్నేరక మోసపోతి, పరమా
త్మా । నన్ను నీ సత్కృపా
జలధిన్ దేల్చుచు జీవితాంతమున నీ
సాయుజ్యమున్ గూర్చి య
ర్మిలి రక్షింపుము కేశవార్చితపదా ।
శ్రీరాజరాజేశ్వరా । 137

శిరమందున్ శశిపూవుగా వెలయ
నీ శృంగార మేపారగా
వరయన్ గంగ తురాయియై మెరయు
నర్ధాంగం బుమాక్రాంతమై
తరుణీలోక సమత్వభావ మవనిన్
దర్శింపఁ జేయుచు దివ్య మూ
ర్తి రహిల్లన్ గనుపింపవే। గొలచెదన్
శ్రీ రాజరాజేశ్వరా। 138

శివుడై కేశవుడై సరోజభవుడై
చిత్తాలయ స్వామియై
స్తవనీయ క్రియలోక పాలన కళా
ధౌరేయుడై కాళ్లు వా
డెవడా విశ్వ కుటుంబి వాని నినుగా
భావించి సేవింతు న
చ్చివ మార్గమ్మిదియంచు బోధవదగవే
శ్రీ రాజరాజేశ్వరా। 139

నా మూర్థంబు భవవత్పదాబ్జములఁ
నానన్ మోపి ప్రార్థింతునో
స్వామీ! నన్నుఁ గృతార్థుఁజేయఁ గృపతో
పాలింప వేవేగ రా
వే మార్జాలకిశోర ధర్మమున
సర్వేశా! దయాసాగరా!
శ్రీమద్వేములవాడమందిరవరా!
శ్రీరాజరాజేశ్వరా! 140

శ్రీమనున్మంగళదాయకంబయి జగత్
శ్రేయ ప్రదంబై శ్రిత
క్షేమానుగ్రహధామమై వెలయు నీ
శ్రీపాదముల్ నమ్మితిన్
స్వామీ! నన్ను గృతార్థుఁజేసి వరముల్
ప్రాప్తింపగా జేయవే!
శ్రీమద్వేములవాడమందిరవరా
శ్రీరాజరాజేశ్వరా! 141

మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ

# ఈ కవి ఇతర కృతులు

ముద్రితం

1. శ్రీ రామలింగేశ్వర నక్షత్రమాల
2. అమరస్మృతులు (ఖండకావ్యం) రు. 7_00
3. శ్రీ శీతారామ తారావళి రు. 5_00
4. శ్రీరాజరాజేశ్వర శతకము రు. 2_00
5. బుద్ధ చరితము (గోలకొండ పత్రికలో ముద్రితం)

అముద్రితం

1. శ్రీరంగశతకము
2. మాతృశ్రీ
3. గేయకథలు
4. భద్రగిరి శతకము
5. పర్ణశాల (గేయకావ్యం)
6. గణాంకదర్శిని
7. దైవదండన
8. The Economic History of ancient Andhra



1962 లో

గ్రంథకర్త

'రసప్రియ'

ఫోతేదార్ కేశవాచార్య

జన్మస్థలం:- శ్రీరంగాపురం. వనపర్తి తాలూకా. మహబూబ్ నగర్ జిల్లా,

అభ్యస్థ విద్యలు :- ఆర్థిక శాస్త్రంలో పట్టబద్రులు, ఆంధ్రాంగ్ల ఉర్దూ హిందీ బాషలలో పరిచయ పాండిత్యములు.

అభిరుచులు :- చిత్రలేఖనం, చరిత్రపరిశోధన, తత్వశాస్త్రం

వ్యాసంగములు: సాంఘికార్థిక ప్రణాళికా గణాంక సమీక్షలు. క్షేత్రచారిత్రక రచనలు.

## అభినందనాశీర్వాదములు

కవిసింహ కాశీపత్యవధానిగారు

చారుపదాంచితంబునయి శ్రావ్యమునై రసవత్తరంబునై
సూరిమనోహరంబునయి శుంభదలంకరణాన్వితంబునై
భూరి సలక్షణంబునయి పొల్చెడు కైతగలట్టి కేశవా
చారికి చెల్లునంచును 'రసప్రియ' యన్ బిరుదంబొసంగితిన్।

సాహిత్యస్థాపక, కవివీర, రా.సు. రాట్కవిగారు

నీవు రసప్రియుండ వవనిన్ రసవంతములై ప్రసన్నమై
చేవగలట్టి సత్కృతులచే విలసిల్లుచునుంటి వీవు శి
ష్యావళిలోన నగ్రజుఁడవంచు దలంచుచునుందు నిన్ను. సీ
తా విభుఁడిచ్చు గాత బ్రహ్మాదంబుగ నీకుఁ జిరాయురున్నతుల్।

జగజ్జనని వేదాంత కవిగారు

నామములెన్నియో గలవు నాటికి నేటికి వాటిలోన నీ
నామము శ్రేష్ఠమై మొదటి నామముగా విలసిల్లె కేశవా!
నీ మధుర ప్రసన్న కమనీయ కళాకవనమ్ముగూడ భా
షామణి చల్వతో నెగడి శాశ్వతమై పొగడించు ధాత్రిపై!

ఆంధ్రమిల్టన్ శతావధాని డోకూరికోట్ల బాల బ్రహ్మాచార్యులుగారు

అర్థిజనంబుగోరిన సహాయము శక్తికొలందినల్పు ని
స్వార్థపరుండు సాధుహిత బంధురతుండయి యెన్నడేనియున్
వ్యర్థుల జోలికిన్ జనక పండితమైత్రినెసంగి కేశవుం
డర్థ గణాంకశాఖ నహహా! అధికారమునంది వర్ధిలెన్।

విద్వత్కవిరత్న పెదపాటి నాగేశ్వరరావు M. A. గారు

గద్వాలాహ్వయ దివ్యభవ్యకవితా కల్లోలినీ సీమసు
విద్యాభ్యాసవశేన—పండితసభాహ్లాద వ్యాజవాత్సల్యతః
సౌశీల్యేనచ పూర్వపుణ్యవశతః సంపాదితం సంస్కృతమ్
యుష్మత్ తెల్గుకవిత్వ సత్వరచనా యోగస్సదా జీయతాత్॥

ఘోతేదారుకులోద్భవ—కేశవనామక మిత్రః
శ్రీశకృపాశిషవృద్ధ్యా—వర్ధతు వర్ధతు నిత్యమ్॥

కవిశేఖర, కె. కోదండరామాచార్య M.A. M.O.L. గారు

రసప్రియేణ నామ్నాచ—గ్రంధరచనాం కరోతియః
సఏవ కేశవాచార్యః—కవితా రసికప్రియః॥

గణాంకశాఖే వృత్తిశ్చ—రక్తిస్సాహిత్య సౌరభే
హరిస్మరణ శీలశ్చ—కేశవార్యో భవత్తదా॥

శ్రీమాన్ కేశవనామార్యః—కవితాతస్య పుత్రికా
భగవత్కృప యాశశ్వత్—జీయాదా చంద్రతారకం॥

కవిభూషణ శ్రీ యర్రం విశ్వనాథంగుప్తగారు

చక్కని చిక్కని కయితల-పెక్కుల రచియించినావు పెద్దలు మెచ్చన్
నిక్కముగ మీ కవిత్వము-చక్కెర తేనియలకన్న చవిగలది సఖా!

"అభినవధూర్జటి"యని మి-మ్మభినందించెదను కేశవాచార్యకవీ!
అభవుండనుగ్రహించుత-శుభసౌఖ్యశ్రీల మీకు శోభిలసుకవీ!

నలువసతి గళమునందున-విలువగు మణిహారములను వేయగ నింకన్
నలుపుము సొంపగు కవితల-నిలుపుము మీ వంశకీర్తి నిచ్చలు సుకవీ!



కొలువై నీ వెసగన్ సతీసుతులతో గూర్చుండియున్నప్పుడిం
పలరన్ గోవరసింహమూషకశిఖివ్యాళంబులున్ మీ కడన్
జెలిమిన్ వర్తిలజేసినట్లు జనులన్ స్నేహంబునన్ ధాత్రి వ
ర్తిలఁజేయంగదె కేశవార్చిత పదా! శ్రీ రాజరాజేశ్వరా!

రసప్రియ